# ఉత్తరాలు

రచనలతోపాటు పోస్టేజి పెట్టి తీరాలి రచనలన్నీ సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, విజయవాడ - 520003 అన్న చిరునామాకి పంపాలి

## జన్మదిన సంచిక

అత్తవారింటికి అడుగు పెట్టబోయే క్రొత్త పెళ్లి కూతురిలా అలంకరించుకుని మా గృహోన్ని పావనం చేసింది 'జన్మదినోత్సవ చవితి సంచిక' కథల్లో 'స్కోరెంత' నన్ను బాగా ఆకర్షించింది ఇతివృత్తం, కథాగమనం క్రొత్త పంథాలో నడిచింది ఈ రోజుల్లో ఆఫీసర్స్‌కి 'చన్‌చాగిరి' చేస్తేగాని క్రింది ఉద్యోగుల స్కోరు (అదే జీవితం) నిలిచేటట్టు లేదు పోతే నవ్వు కథ మహా బోర్ నవ్వుదామని ప్రయత్నించినా నవ్వు రాలేదంటే నమ్మండి! కార్టూనులు వండర్‌ఫుల్ వినాయకచవితి సంచిక అన్నందుకూ, ప్రత్యేకతలతో కూడి ఉన్నందుకు 'పత్రిక'కు నా శుభాకాంక్షలు

గాదంశెట్టి రామ్మోహన్ (ఖర్గపూర్)

* *

ఈ వారము ఆంధ్ర సచిత్ర వారపత్రిక వినాయకచవితి సంచికగా వెలువడుట మూడా మావు ఆంధ్ర సచిత్ర వారపత్రికకు 68 సంవత్సరాలు నిండిన సందర్భమున మా శుభాకాంక్షలు అర్ధ శతాబ్ది దాటి కూడా నిర్బంధ రహిత విరమణ కాలేదంటే (వారపత్రిక) నీతి నిజాయితీలు నిరూపించినది సమర్థతను చాటి చెప్పినది ఆంధ్ర సచిత్ర వారపత్రిక పుట్టిన రోజు పండుగ వినాయకచవితి పండుగ ఒకే రోజు అగుట అత్యంత విశేషము దీనివలన ప్రజా సేవకులు, దేశోద్ధారకులు అయిన శ్రీ శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు (పత్రిక స్థాపితులైనందున) వినాయకచవితి పండుగ రోజే ఈ పత్రిక ప్రచురణ ప్రారంభించుట వారి ఆస్తికత్వమును, వారికి శ్రీ వినాయకస్వామి వారియందుండే భక్తిని తెలుపుచున్నది ఈ సారి ప్రత్యేకసంచికను ఎక్కువ పేజీలతో ఇంకా ఎక్కువ అలంకరణలతో అందరికి అందజేయుగోరుతాము ఈ ప్రత్యేక సంచికలో వినాయకునిపైన ఎన్నో వ్యంగ్య కార్టూనులు ఉన్నవి నవ్వటానికి బాగున్నప్పటికీ విఘ్నేశ్వరుడు భగవంతుడు కాబట్టి



భయము కలిగినది కాని తమాషాకు కాబట్టి, వారికి ఆగ్రహము కలుగదని మనస్సు మరల సమర్థించినది ఈ వినాయకునిచవితి సందర్భమున గణపతి పలు జనంబులపై ఎ ఉండ్రాళ్ల వర్షం కురిపించి ఉండ్రాళ్లతో వారి పొట్టపైన కొట్టాడు వర్తకులపైన, అక్రమ వర్తకులైతే ఫర్వాలేదు విఘ్నేశ్వర వైభవం బొమ్మలు ఇంకా ఉంటే బాగుండేదనిపించినది

సూర్యదేవర గిరిజాప్రసాద్, (తిరుమలహిల్స్)

* * *

ఆంధ్ర సచిత్ర వారపత్రిక 68 సం లు నిండినందులకు ఆంధ్ర భాష కళామతల్లికి ఎనలేని సేవ చేసినందులకు నా తరపున, శుభాకాంక్షలు అందజేస్తున్నాను వినాయకచవితి హాస్య సంచికలో ముఖ్యంగా కార్టూనులు కడుపుబ్బ నవ్వులు చిందిస్తున్నాయి అందమయిన ముఖచిత్రంతో అలరారిన ఈ పత్రిక అందరి మన్నన లందుకొంటుందనటంలో సందేహంలేదు ముఖ్యంగ నవ్య రచయితలకు ఇస్తున్న ప్రోత్సాహం ప్రశంసనీయము 'గణపతులెందరు', ''చలపతి'', మినీ ఇంటర్వ్యూ, 'స్కోరెంత', వినాయకుని లీలలు' 'బైస్కోపు బొతాఖానీ' మొదలగునవి మీ పత్రికకు కలికితురాయిల వంటివి

కార్టూన్ల సంగతి మరి చెప్పనలవి కాకుండా ఉన్నది— ఒకటొ నవ్వులపువ్వులు కురిపిస్తున్నాయి

ఇటిక్యాల మాణయ్య, (గజ్వేలు )

## కుడిఎడమైతే

12 9 75 వినాయకచవితి హాస్య సంచిక మమ్మల్ని ఎంతో ఆకర్షించింది జయదేవ్‌గారి కార్టూన్లు మమ్మల్ని నవ్వించినా వినాయకుడికి జందెం వేయడంలో పొరపాటు చేశారన్న కొంటాను జందెం ఎడమ భుజం మీదుగా రావాలి గాని, కుడి వైపున ఉన్నట్టుగా చిత్రించారు ఇది గమనించ ప్రార్థన 'అమావాస్య వెన్నెల' నన్నెంతో ఆకర్షించింది సీరియల్సు బాగున్నవి

కె రమాదేవి, (ఉగార్‌ఖుర్ద్ )

## ప్రయోజనం ఏమిటి ?

పత్రికలో యువతరం, మినీ ఇంటర్వ్యూల వంటి శీర్షికల వలన పాఠకులకి ఏం ప్రయోజనం ఉందో అర్థం కావటంలేదు ఇప్పుడున్న వాట్లో నాకు బాగా నచ్చిన శీర్షిక బలుసు గారి ధర్మపథం

బి ఎర్రయ్య, (సునాబేడా )

ఆంధ్రప్రదేశ్‌లో వినోదపు పన్ను
రద్దు చేయబడిన మొట్టమొదటి
తెలుగు చిత్రం











# తీర్పు (A)

## THE JUDGEMENT

కథ శ్రీమతి **పద్మినీ రాజన్** - నిర్మాణం-దర్శకత్వం LION **ల. విశ్వేశ్వరరావు** B.Sc.









**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 – 1972)
శుక్రవారం : 10–10–'75
రాక్షసనామ సం. ఆశ్వయుజమాస శు. షష్ఠి
*సంపుటము : 69 సంచిక : 5*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

★

సంవత్సర చందా – రు. 33-80
ఆరుమాసాల చందా – రు. 16-90
విడిప్రతి వెల 60 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ–520003.


## విషయానుక్రమణిక





కథలు :

| | | |
|---|---|---|
| శ్రీమతి | ... | 7 |
| పోర్ట్రైట్ | ... | 18 |
| చేను మేసిన కంచె | ... | 38 |

సీరియల్ కథలు :

| | | |
|---|---|---|
| గాజుమేడ | ... | 22 |
| రాగ వీచికలు | ... | 31 |

వ్యాసాలు, శీర్షికలు :

ఉత్తరాలు — 2, హైదరాబాద్ నోట్‌బుక్, రాశిఫలాలు—6, ధర్మపథం—9, ఫిలాసఫీ నిద్రిస్తూ రి — 16, డాక్టర్ సలహాలు, వారఫలం—17, వేశ్యల బ్రతుకు పూలసెజ్జ కాదు — 20, సినిమా — 24, ప్రశ్నావళి — 43, సామాన్యుని సణుగుడు, మిస్ ఇంటర్వ్యూలు—45, అవీ—ఇవీ–అన్నీ —46, సంతోషమే సగము బలము—47.

## త. నా. సాం. సం. న్యూయార్క్

అయిదు సంవత్సరాల క్రితం స్థాపించబడిన, న్యూయార్క్ తెలుగు సారస్వత, సాంస్కృతిక సంఘం, ప్రతి ఏడాదీ అన్నివిధాలా అభివృద్ధి చెందుతూ, నేటికి రెండు వందల సభ్యులకు పైగా సేవ చేస్తూ వచ్చింది.

ఆగస్టు 23వ తేదీ, వనభోజనంతోపాటు నూతన కార్యవర్గానికి ఎన్నికలు జరిగాయి. వనభోజనానికి పద్మశ్రీ జి. ఎస్. నరసింహారావు, శ్రీ పాటిబండ్ల చంద్రశేఖరరావు, జి. వి. సుబ్బారావు మున్నగు తెలుగు ప్రముఖులు వచ్చారు. ప్రస్తుతం అమెరికాలో పర్యటిస్తున్న విజయవాడ పురప్రముఖులు శ్రీ కాట్రగడ్డ మధుసూధనరావు కూడా హాజరయ్యారు.

నూతన కార్యవర్గానికి, డాక్టరు కాకర్ల సుబ్బారావు అధ్యక్షులుగాను, వావిలాల కృష్ణశాస్త్రిగారు కార్యదర్శిగాను ఎన్నుకోబడ్డారు.

నూతన కార్యవర్గం, పట్టుదలతో పనిచేయడానికీ, న్యూయార్క్ ప్రాంతాల్లో ఉన్న తెలుగు పిల్లలకు ప్రతి ఆదివారం తెలుగు నేర్పడం ఏర్పాటుచేయడానికీ, న్యూయార్క్ సందర్శించే, ప్రముఖ తెలుగువారిని సన్మానించడానికీ, ఇంకా కొన్ని సరికొత్త కార్యక్రమాలు అమలుజరపడానికి తలపెట్టింది.

కాకర్ల సుబ్బారావు, జమైకా ఈస్ట్,
(న్యూయార్క్— 11432.)

### జోర్హాట్ ఆంధ్రులు

జోర్‌హాట్‌సిటీ, అస్సాము స్టేట్‌లో తెలుగు సభ్యులు, 25వ తేది ఆగస్టు నెల, 1975 సంవత్సరమున తెలుగు గ్రంథాలయం మొదటి వార్షికోత్సవము గొప్పగా జరుపుకున్నారు. ఆ వార్షికోత్సవమునకు ముఖ్య అతిథిగా గ్రూపు కాప్టెన్ ఆర్. కె. కుక్కర్‌గారు ఆహ్వానింపబడ్డారు. అధ్యక్షులు రిటైర్డ్ మేజరు ఆంధ్రోసుగారు సుస్వాగతము పలికారు. అటుతర్వాత పూజా డ్యాన్సు, తెలుగు, హిందీ పాటలు, భరతనాట్యములతో అతిథులు, తెలుగు సభ్యులు ఆనందడోలికలలో వూగారు. చివరన కార్యదర్శి బి. హెచ్. ఆదినారాయణగారు వందనసమర్పణ పలికారు.

బి. హెచ్. ఆదినారాయణ, కార్యదర్శి,
(జోర్హాట్.)

### జన్మదిన సంచిక

వినాయకచవితి సంచిక ఎంతో ఆకర్షణీయంగా రూపొందించారు. 'నవ్వు నాలుగు విధాల చేటు' అనే నీతిని 'నవ్వు' కథ తిరిగి పాఠకులకు గుర్తు చేసింది. సిరాజీగారు గణపతిలో జరిపిన మినీ ఇంటర్వ్యూ చాలా నవ్వు పుట్టించేదిగా ఉంది. "ఈ అమ్మాయి రాగలిందరి మరీ అన్యాయంగా నన్ను ఎంతో లావుపాటి లేక వలం పాటివాణ్ని అని జోక్ చేసి వాలెరూవ్‌కి...." అన్న విఘ్నపతి మాటలు తలంచుకుంటె నవ్వు ఆగడంలేదు. ఈ విషయంలో రాగలిసందరిగారు తక్కిన మేల్ కార్టూనిస్టుల కంటే ఎంతో ఫార్వార్డ్‌గా తోస్తున్నారు. వినాయకుని బాధ చూసి నవ్వు ఆగడంలేదు. ముఖ్యంగా ఇస్తే ఇంతా ... నారాయణగారు ... నాకూ ఒరుగులుంది

ఎస్. కె. ..., (...)





# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

## తెలుగు వైభవం మ్యూజియం

రాక్షస ఉగాదికి జరిగిన ప్రపంచ తెలుగు మహాసభల ఫలితాలలో రెండవది "తరతరాల తెలుగు వైభవం" మ్యూజియం. దీనికి రాష్ట్రపతి శ్రీ ఫక్రుద్దీన్ అహమద్ ఆలీ సెప్టెంబర్ 13 వ తేదీన బాగయామ్‌లో శంకుస్థాపన చేయడం తెలుగుజాతి చరిత్రలో అపూర్వ ఘట్టం. రాష్ట్రపతి తమ ప్రసంగంలో సూచించినట్టు తెలుగు వారి గత వైభవ చిహ్నాలైన సూ్తపాదిసంపద బ్రిటిష్ మ్యూజియం, మద్రాసు మ్యూజియం, మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తకభాండాగారం, సరస్వతీ మహల్ లైబ్రరీ మున్నగు పెక్కు స్థలాలలో సంగృహీతమై వుంది. దీనిని ఈ కొత్త మ్యూజియంకు సంపాదించడం, లేకపోతే ప్రతికృతులనన్నా సంపాదించడం అవసరం. ఆమధ్య బుద్ధ జయంతి పంచ వింశ శత వార్షికోత్సవం సందర్భంగా ప్రత్యేక సంచికలు వేయవలసి వచ్చినప్పుడు ఎక్కువభాగం ప్రతికృతుల ఫొటోలు, శిల్పవాస్తు ప్రతిరూపాలు బ్రిటిష్ మ్యూజియం నుంచి తెప్పించవలసి వచ్చింది. అవి అక్కడ భద్రంగా వున్నందుకు బ్రిటిష్ జాతికి మనం ఎంతో కృతజ్ఞులమై వుండాలి. — ఎందుకంటే, మన పూర్వులు, ఇప్పటివారూ కూడా వాటి విలువ తెలియక దేవాలయాల మూల బంధాలలో వేయడం, సున్నపురాళ్లలో కలిపి వేయడం చరిత్రవేత్తలకు తెలిసిన సంగతి. గవర్నర్ శ్రీ ఓబుల రెడ్డి తెలుగువారి స్వభావాన్ని సమర్థించారు. తమ ప్రసంగంలో ఈ సందర్భంలో సవినయంగా మనవి చేయవలసివుంది. 'దోకనోజ్ తీన్ చూల్హే'' ఇద్దరు కనోజువారు, మూడు పొయ్యిలు—అని హిందీ సామెత. అంతభేదం అన్నమాట ఈసామెత తెలుగు వారికి పూర్తిగా అన్వయిస్తుంది. తెలుగువారికి ఉన్న మంచి గుణాలతోపాటు అవలక్షణాలూ చాలఉన్నాయి. రెండు మూడు ఆంధ్ర సంఘాలు లేని పట్టణం వుండదు. అసహనం, వాక్ చాపల్యం మనకు మరీ ఎక్కువ. ఇన్ని విశ్వవిద్యాలయాలు వచ్చాయి. ఇన్ని కళాశాలలు లేచాయి. ఇన్ని డిగ్రీలు అబ్బాయి, అయినా విమర్శనం సహించే గుణం మాత్రం మనకులేదు. "నేను చెప్పింది వేదవాక్యం. వీడేమిటి నన్ను అనడం !" అనే ధోరణిలో వుంటుంది, మన విశ్వవిద్యాలయాచార్యుల ధోరణి. ఇలాగే ఇతరుల ధోరణి. మన జాతి భారత సమాఖ్యా మాలికలో మణిపూస కావాలంటే, ఇతర రాష్ట్రాలవారి, ఇతర దేశాలవారి గుణగణాలు పూర్తిగా మనం అలవరచుకోవాలి.

## గిరిజనాభ్యుదయం

దేశంలో దాదాపు నాలుగుకోట్లమంది గిరిజనులున్నారు. వీరు అనాది సభ్యతా సంస్కృతులకు జీవచ్చిహ్నాలు వీరిని ఆధునిక నాగరకులను చేయడంతోపాటు వీరి ప్రాచీన సంప్రదాయాన్ని పరిరక్షించడమూ అవసరం. ఈదృష్టితో కేంద్ర హోంశాఖా మంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి గిరిజన సంక్షేమంకోసం ఇటీవల సూచించిన 1500 కోట్ల రూపాయల పథకం స్థానిక గిరిజన నాయకులకు హర్షదాయకమయింది. మన రాష్ట్రంలోని కోయ, చెంచు, మొదలయిన తెగలవారి రక్షణాభ్యుదయాలు తెలుగు ప్రాచీన తత్త్వావగతికీ అవసరాలు.

## శ్రీ గోలి వీరభద్రరావు

"ఇదుగో ! కళ్లకట్టు జాగ్రత్తగా వుంచుకో ఆపరేషన్ అయినకంటి వైపు పడుకోకు గట్టి పదార్థాలు నమలకు. కన్ను అదురుతుంది. ముఖం కడుక్కోనేటప్పుడు కేకరించి ఉమ్మివేయడం, వేళ్లు ఆంగిటివరకు దోపుకొని వాంతిచేసుకోడం చేయకు ఆస్పత్రిలో అందరూ గుడ్డివారే. ఎవరి చేయన్నా నీకంటికి తగిలేను ! జాగ్రత్త !"— ఈమాటలు ఏ డాక్టరువో, సిస్టరువో అనుకొనేరు కాదు. ఒక రోగి మాటలు. ఆయన పేరు శ్రీ గోలి వీరభద్రరావు. ఆరడుగుల దృఢకాయుడైన శ్రీ వీరభద్రరావు సెంట్రల్ రిజర్వు పోలీసు శాఖలో డిప్యూటీ పోలీసు సూపరింటెండెంటు. సరోజినీదేవి కంటి ఆస్పత్రిలో కంటి చికిత్సపొందుతూ వున్నారు. ఎంతటి దయార్ద్ర హృదయం ! ఆయన పోలీసు

(37 వ పేజీ చూడండి)




ఇసుక ప్రోగుచేసి నీవు
ఎన్నటికీ గోడ
పెట్టలేవు, నిలువదురా
వృథా వెర్రివాడ !




సూర్యుడు ఉదయించాడు. సముద్రంలో నుంచి కాదు తూర్పు కొండల నడుమనుంచి ఉదయించాడు. ఆ ఊళ్లో కొండలేగాని సముద్రం లేదు. రాత్రంతా మంచుకు తడిసిన గడ్డిపూలు అందంగా మిలమిల మెరుస్తున్నాయి. ఆ రోజు మరీ ప్రత్యేకంగా కనిపిస్తున్నాయి. అందంగా గులాబి పువ్వుల్లా కనిపిస్తున్నాయి దారిన పోయే వాళ్లు ఓ క్షణం ఆగి. వింతగా చూస్తున్నారు.

పది గంటలకి కాలేజీ గేట్లు తెరుచుకున్నాయి.

అంత పెద్ద ఆర్ట్సు కాలేజీలో అంతవరకు 'రచయిత' అనబడే శాల్తీ లేదు. ఆ లోటును తీర్చటానికి అహమ్మద్ ఖాన్ అవతరించాడు. అతను ఎప్పట్నుంచి కథలు రాస్తున్నాడో ఎవరికీ తెలీదు కాని 'శ్రీమతి' అనే కలం పేరుతో కథలు రాస్తున్న వ్యక్తి 'అహమ్మద్ ఖాన్' అని ఆ రోజే అందరికీ తెలిసింది.

అహమ్మద్ చాలా కథలు రాశాడట. కవితలు అల్లాడట. అతను అందరిలా ఆషామాషీ రచనలు చేయడట. అతను చేసే ప్రతి రచనలో కొత్త ప్రక్రియ కనిపిస్తుందట. ఎన్నుకునే ఇతివృత్తం బావుంటుందట. చెప్పవలసిన విషయాన్ని చక్కగా సూటిగా చెప్తాడట. అతని కథల్లో 'బీట్ ఎబౌట్ బుష్' ఉండదట. అతని రచనలో 'సెయిట్' కనిపిస్తుందట.

'అహమ్మద్ ఖాన్' పెద్దవాళ్ల రచనలు చాలా చదివాడట. అతనికి రాబర్టు బ్రౌనింగ్ పద్ధతి నచ్చుతుందట. చెకోవ్ కథల్లో జీవితం ప్రతిబింబిస్తుందట. కవిత్వం వస్తాయట. మామ్ కథల్లో సస్పెన్స్ బావుంటుందట. చదువుతున్నంత సేపు థ్రిల్‌గా ఉంటుందట.

కాలేజీలో అందరికీ 'అహమ్మద్ ఖాన్— రచయిత' అని తెలిసిపోయింది. సుమిత్ర లాంటి ఒకరిద్దరు అమ్మాయిలకి తప్ప. 'మాకూ రచయిత ఉన్నాడోచ్' అని అంతా సంబరపడిపోయారు. సన్మానం చేస్తామని ఖాన్ భాయిని యిబ్బంది పెట్టారు. ఖాన్ వద్దన్నాడు. తను చాలా చిన్న రచయిత నన్నాడు. రచనావ్యాసంగంలో తనింకా 'ఉంగా ఉంగా' అంటున్నానని చెప్పుకున్నాడు. తను సన్మానాలు చేయించుకొనే ఎత్తుకి ఎదగలేదన్నాడు. 'ఖాన్ భాయేమిటి, కథలు రాయడమేమిట'ని కొందరు జలసీ రాయుళ్లు కొట్టిపారేశారు. మనిషిలో భావాలకి మతానికి సంబంధం లేదు. మంచి భావాలుంటే ఏ భాషలోనైనా కథలు రాయొచ్చు. కవిత్వం చెప్పొచ్చు. అహమ్మద్ ఖాన్ ఆంధ్రదేశంలో పుట్టి పెరిగాడు. అతను తెలుగులో కథలు రాస్తున్నాడేమిటని ఆశ్చర్య పడనక్కలేదు' అని ఖాన్ భాయి ఫాన్స్ కొందరు ఏడ్చే వాళ్ల నోళ్లు మూయించారు.

ఆర్నెల్ల క్రితం అహమ్మద్‌ఖాన్ సెకండు బియ్యేలో కొత్తగా చేరాడు. అతను క్లాసులో చాలమందితో స్నేహం సంపాదించాడు. ఏ విషయమైనా అతను చాలా తమాషాగా మాట్లాడతాడు. పత్రికల్లో వచ్చే కథల్ని చక్కగా చర్చిస్తాడు. అతను సాహితీ ప్రియుడని అంతా అంటారు. కానీ, అతను కథలు రాస్తున్నట్లు ఎవరికీ చెప్పలేదు. తను రచయితని ఏసందర్భంలో తెలియనివ్వలేదు. ప్రత్యేకంగా తన గురించి చెప్పుకోవటం యిష్టంలేకేమో? ఆరోజు — సుమిత్రకోసం 'శ్రీమతి' పేరుతో కథలు తను రాస్తున్నట్లు అహమ్మద్‌ఖాన్ చెప్పుకున్నాడు. ఎందుకంటే! సుమిత్రకి కథలన్నా, కథలు రాసేవాళ్లన్నా చాల యిష్టం.

సుమిత్రని చూసినప్పుడు అహమ్మద్‌ఖాన్ తన్ని మరిచిపోతాడు. ఆమె అందం చూసినప్పుడు— జీవితాంతం అలా చూస్తూ గడిపేయాలనిపిస్తుంది ఆమె నవ్వినప్పుడు రాలిపోయే ముత్యాలు ఏరుకోవాలనిపిస్తుంది. చీర పైటను అలవోకగా తలమీదికి జార్చినప్పుడు ఆమెను ఎగతాళి చేయాలనిపిస్తుంది ఆమె మాట్లాడినప్పుడు ఆకళ్లలో కలకాలం నిలిచిపోవాలనిపిస్తుంది చిరు చెమటకి జారిపోతున్న కుంకుమ రేకల్ని లెక్కచేయకుండా చిరుకోపం ప్రదర్శించినప్పుడు ఆమెను అల్లరి చేయాలనిపిస్తుంది. అంత అందమైన అమ్మాయికి తను 'రచయిత' అని తెలిస్తే బావుండునను కున్నాడు, ఖాన్ బాయి.

# శ్రీమతి

ఆక్లాసులో చాలమందికి సుమిత్రంటే యిష్టం. ఆమెకి రచయితలన్నా, రచయిత్రులన్నా యిష్టం. వాళ్ల నాన్నగారిచేత అన్ని పత్రికలు కొనిపిస్తుంది. కొత్త పుస్తకాలు రప్పిస్తుంది. కథలు, సీరియల్స్ విడిచి పెట్టకుండా చదువుతుంది. తను మెచ్చిన కథను ఇంట్లోవాళ్లచేత, కాలేజీలో అమ్మాయిలచేత చదివిస్తుంది. ఆకథను రాసిన వాళ్లను ఆకాశానికి ఎత్తేస్తుంది. సుమిత్రకి వంట చేయటం బాగా వచ్చును. కానీ, ఆమె వంటింటి కథల్ని యిష్టపడదు. ఆమెకి తరచుగా ంూస్టమన్ కలరు లాంటి కలలు వస్తాయి. కానీ, స్వప్నాలతో మోసం చేసే రచనలంటే అసహ్యంచుకుంటుంది. ఆమె కన్నీళ్లు తెచ్చుకున్న సందర్భాల్లేవు. సంఘటనలూ లేవు. కానీ, కన్నీటి కథల్నీ, కన్నీళ్లు తెచ్చే రచనల్నీ మెచ్చుకుంటుంది. ఆమెతో స్నేహం చేయాలంటే అంతో యింతో కథల గురించి, రచనలుచేసే వాళ్లగురించి తెలిసుండాలి. అలా కాకపోతే - ఆమెతో పరిచయం 'హల్లో' దగ్గర ఆగిపోతుంది.

"హల్లో" లీజరులో కొత్త పుస్తకం చదువుకుంటున్న సుమిత్రకి - ఆరోజు కాలేజీలో జరిగిన విశేషం 'వింతలు - విడ్డూరాలు'లో చేర్చి, చెప్పింది ఓ రెండుజడల సీత, ఓజడను ముందుకు లాక్కుంటూ.

సుమిత్ర నమ్మలేదు. చాలాసేపు ఆమెకి నమ్మబుద్ధి కాలేదు. అసలు నమ్మలేకపోయింది.

"ది [illegible]ట్ హమ్మద్‌ఖాన్ అతను 'శ్రీమతి' పేరుతో కథలు రాస్తున్నట్లు మన కాలేజీలో అందరికీ తెలిసిపోయింది. పత్రికలో అతని కొత్త కథ చదివిన వాళ్లంతా క్యూలో నిలబడి 'కంగ్రాట్స్' చెబుతున్నారు, నన్ను నమ్మకపోతే, అలా వెళ్లిచూడు" రెం. జ. సీత రెండోజడను కూడ ముందుకి లాక్కుంది.

సుమిత్రకి నమ్మకం కుదిరింది. ఆమె చాలమంది రచనలు చదివిందిగాని ఒక్కరినీ చూడలేదు. కథలు రాసేవాళ్లతో పరిచయమూ లేదు. అహమ్మద్‌ఖాన్ కథలు రాస్తున్నాడని, శ్రీమతి తన క్లాసుమేటని తెలిసి, సుమిత్ర ఎగిరి గంతేసింది.

"ఐ బిలీవ్ యూ, సీతా..." రెం. జ. సీత రెండుజడలు పట్టి ముందుకి లాక్కొని, రెండు బుగ్గలు మీద ముద్దులు పెట్టింది, సుమిత్ర.

అందరిలా-సుమిత్ర కథలు చదివి ఊరుకోలేదు. ఆ కథలు రాసిన వాళ్లను గురించి ఓ క్షణం ఆలోచిస్తుంది. కథల్లో కనిపించే రచయితల జీవితాలు గురించి కాసేపు ఊహిస్తుంది.

అహమ్మద్ ఖాన్ గురించి ఆలోచించకుండా ఉండలేకపోయింది, సుమిత్ర.

*　　*　　*

రచయితని తెలిసిన తర్వాత అహమ్మద్ ఖాన్ మీద ప్రత్యేకమైన అభిమానం సుమిత్రకి ఏర్పడింది. అంతకు ముందు అతనితో ఎప్పుడూ మాట్లాడని ఆమెకి అతనితో ఎప్పుడూ మాట్లాడాలనిపిస్తుంది. అహమ్మద్ ఏ విషయం మాట్లాడినా ఓ కథలా ఉంటుంది. కవితలా వినబడుతుంది. అతనికి యిరవయ్యేళ్లు దాటలేదు. చాల చిన్నజీవితం. ఆ అనుభవసారంతో చాల పెద్ద భావాలు గల కథలు రాస్తున్నాడు. మనిషి జీవితానికి అద్దం పట్టి, పాఠకుల చేత కన్నీళ్లు కార్పించే రచనలు చేస్తున్నాడు. అతను 'క్రియేటివ్ జీనియస్' అనుకుంటుంది, సుమిత్ర.

ఆ మాటే సుమిత్ర-అహమ్మద్ ఖాన్‌తో అంది.

"మీరు జీనియస్. మీ కథలు చదివితే, మాలాంటి వాళ్లం జీవితం గురించి చాలా తెలుసుకోగలం." కేంటీన్‌లో యిద్దరూ కూర్చొని, కథల మీద చర్చ సాగిస్తున్నారు.

"మీ అభిమానం అలా పలికిస్తుంది. నిజానికి నేనంత గొప్పవాణ్నికాదు. చాల చిన్నవాడిని." గాలికి కదులుతున్న ముంగురుల్ని సవరించుకుంటున్న సుమిత్రను చూసి, అహమ్మద్ అభిమాన పడ్డాడు.

"ఇది నా అభిమానం కాదు. చాలమంది అభిప్రాయం. మీ రెవరో తెలీని ఎందరో పాఠకుల అభిప్రాయం. మీ కథల మీద వాళ్ళు రాసిన అభిప్రాయాలు చదివినప్పుడు — మీకు మంచి పాప్యులారిటీ ఉందని, అది గ్యారంటీగా మిమ్మల్ని గొప్పవాళ్లను చేస్తుందని నా విశ్వాసం."

"మీ అభిప్రాయానికి చాల థాంక్స్. కానీ, ఈ పాప్యులారిటీ మీద నాకు నమ్మకంలేదు. నేను గొప్పవాణ్ని కావాలని ఆశాలేదు. ఎందుకంటారా? ఈ రోజుల్లో దేవుడి పాప్యులారిటీకే గ్యారంటీ లేదండీ. ఒక్కో సీజన్‌లో ఒక్కోదేవుడు వెలిగిపోతూ ఉంటాడు. ప్రజలు పిచ్చిగా ఆరాధిస్తారు. గుడ్డి నమ్మకాలతో అన్నిటికి ఆ దేవుడే దిక్కని గాలిలో దీపాలు వెలిగిస్తారు ... ఏప్పుడైనా అనుకున్నది జరగనప్పుడు, అసమర్ధతకి ఓడిపోయినప్పుడు — ఆ దేవుడికి మహిమలేదని, మరోదేవుణ్ని వెదుకుతారు. పాత దేవుణ్ని మరిచిపోయి, కొత్త దేవుణ్ని మనసులో నిలుపుకుంటారు. పాత దేవుడికి సీజన్ పోతుంది. మరుగున పడిపోతాడు. కొత్త దేవుడికి పాప్యులారిటీ పెరుగుతుంది. ఆ దేవుడి తర్వాత మరోదేవుడు. ఆ తర్వాత మరో దేవుడు. దేవుళ్ల పాప్యులారిటీకే గ్యారంటీ లేదండీ అష్టరాల్ రచయితను. నాపాప్యులారిటీ గ్యారంటీఅని, అది నన్ను అందలం ఎక్కిస్తుందని ఎలా నమ్మమంటారు?"

సుమిత్ర పకపకా నవ్వింది.




## ప్రహ్లాదుని ప్రత్యేకత ——

భగవద్భక్తులు ఎందరో ఉంటారు. కాని, వారిలో ప్రధానులైనవారెవరు? అనే ప్రశ్న వచ్చినప్పుడు తరచుగా ఈ శ్లోకం గుర్తుకు వస్తుంది. అది —

"ప్రహ్లాద నారద పరాశర పుండరీక
వ్యాసాంబరీష శుక శౌనక భీష్మ దాల్భ్యాన్,
రుక్మాంగదార్జున వశిష్ఠ విభీషణాదీన్
పుణ్యానిమాన్ పరమభాగవతాన్ స్మరామి."

ఇందు చెప్పబడినవా రందరూ పుణ్యాత్ములు. పరమ భాగవతోత్తములు.

భగవంతుని స్మరణ యెట్టిదో, వీరిస్మరణ కూడా అట్టిదే! వీరి స్మరణవల్ల తమ పాతకాలు నశించగలవని ప్రార్థించేవారి అభిప్రాయం.

ఈ పరమ భాగవతుల్లో నారదుడు సదా భగవంతునిలో ఉండేవాడు. వ్యాసుడు భగవదవతారమూర్తియే! అర్జునుడు భగవానుని బావమరిదిగదా! తక్కినవారూ సామాన్యులు కారు ఇట్టివారందరూ ఉండగా అందరిలోనూ ప్రథముడుగా ప్రహ్లాదునే ఎందుకు చెప్పాలి? వీరందరికన్నా అతని గొప్పతనం ఏమిటి? అనే సందేహం కలగవచ్చు.

ప్రహ్లాదునికి పసితనంనుంచీ అనేకమైన ఉత్తమ గుణాలు అలవడ్డాయి భగవద్భక్తి ఉగ్గుపాలతో అలవాటయింది. వేరెవ్వరూ పడని బాధలన్నీ పడ్డాడు. ప్రాణాలను తృణప్రాయంగా తలచి సర్వకాల సర్వావస్థలయందూ భగవన్నామ స్మరణనే చేస్తూ ఉండేవాడు. చివరకు విష్ణువు ఉగ్ర నరసింహ రూపంతో స్తంభంనుండి ఆవిర్భవించి హిరణ్యకశిపుని సంహరించి కూడా కోపం చల్లారక అట్లే ఉన్నప్పుడు - దేవతలకూ, లక్ష్మీదేవికి కూడా అతనిని శాంతపరచడం సాధ్యంకానప్పుడు తానే శాంతపరచగలిగాడు. భక్తవత్సలుడైన భగవంతుడు వరం కోరుకోవలెనని అడుగగా ఉత్తములు కోరుకొనే మోక్షాన్నయినా కోరుకోలేదు "నాకే కోరికా లేదు కాదు-కూడదు. వరం ఇస్తానని పట్టుదలతో ఉంటే — ఏ కోరికలూ నాకు కలగకుండా ఉండేటటుగా వరాన్ని అనుగ్రహించు" అని మాత్రమే అడిగాడు.

ఏ కోరికా లేకుండా ఉండడమే ఉత్తముని స్వభావమని లోకానికి ప్రహ్లాదుడు చాటినాడు. ఇదే అతనియందలి ప్రత్యేకత.

అందువల్లనే అతడు భక్తులందరిలోనూ అగ్రస్థానాన్ని పొందగలిగినాడు.

---

'మొత్తానికి రచయితలనిపించుకున్నారు, బాబూ...'

నవ్వుతున్న ఆమెను చూస్తూ, అహమ్మద్ ఊహల్లో తేలిపోయాడు.

ఇద్దరూ కాఫీ తాగి, కేంటిన్ నుంచి బయటపడ్డారు.

"ఆదివారం మా యింటికి రండి. మీతో చాల విషయాలు మాట్లాడాలి." అహమ్మద్ అడిగాడు.

"తప్పకుండా వస్తానండీ." సుమిత్ర వెళ్ళిపోయింది.

ఆకాశంమీద ఉండవలసిన అందాల హరివిల్లు నేలమీద నడిచిపోతుంటే, అహమ్మద్ చూస్తూ ఉండిపోయాడు. ఆ హరివిల్లు తన సొంతం కావాలని ఆశ పడ్డాడు.

ఆదివారం వచ్చింది.

హరి విల్లు వచ్చింది.

ఇంట్లో అందరూ సినిమాకి వెళ్లిపోయారేమో అహమ్మద్ ఖాన్ ఒంటరిగా ఉన్నాడు. తన మనస్సులోని అభిప్రాయం — సుమిత్రకి చెప్పాలని ఉవ్విళ్లూరాడు. కానీ, ఆమె కథల గురించి, రచనలు చేసేవాళ్ల గురించి తప్ప మరే విషయం మాట్లాడలేదు అతను రాసిన కథల పుస్తకాలు, అతని లైబ్రరీలో పుస్తకాలు తిరగేసింది. అందులో అడివి బాపిరాజు, బుచ్చిబాబు, చలం, రావిశాస్త్రి, లతల రచనలు వున్నాయి. ఏదో ఒకనాటికి అహమ్మద్ కూడ అంతటి వాడవుతాడనిపించింది, సుమిత్రకి.

"ఈ గొప్పవాళ్ల మధ్య మీరు కూడ చోటు చేసుకుంటారు సార్." సుమిత్ర — " చివరికి మిగిలింది " నవల పుస్తకాల దొంతరల మధ్య ఉంచుతూ అంది.

"అయాం వెరీ కైండాఫ్ యూ ... " అహమ్మద్ ఆమె చేతికి కాఫీ కప్పు అందిస్తూ అన్నాడు 'మీ మనసులో చోటు చేసుకుంటే నాకు చాలు' అనుకున్నాడు మనసులో.

కాఫీ తాగడం పూర్తిచేసి. కప్పు టేబిల్ మీద ఉంచింది సుమిత్ర. కొన్ని క్షణాలు మౌనంగా దొర్లిపోయాయి.

"ఖాన్‌గారూ! పత్రికల్లో మీ కొత్త కథలు ఏమైనా వస్తున్నాయా?" అతను రాసిన కొత్త కథలు గురించి సుమిత్రకి తెలుసుకోవాలనిపించింది.

"కొన్ని కథలు తొందరలో చూడగలరు" అహమ్మద్ మామూలుగా చెప్పాడు.

సుమిత్రకి ఆతృత హెచ్చింది.

"ఏ పత్రికల్లో వస్తున్నాయండీ? మీకు ముందుగా యింటిమేట్ చేశారా?"

అహమ్మద్ చిన్నగా నవ్వేడు.

"నేను పత్రికల వాళ్లకి కొత్తవాణ్ణి కాదని, ముందుగా యింటిమేట్ చేయరు. నేను కథ పంపిన వారం పదిరోజుల్లో ప్రచురిస్తారు. ఏకంగా కథ అచ్చయిన పత్రికని పంపిస్తారు."

"చూశారా? మీ రచనలంటే పత్రికల వాళ్లకి ఎంత క్రేజో? మీరు చాల రచనలు చేయాలి సార్. మీరు రాసే కథలు చదవాలని నా లాంటివాళ్లు ఎందరో ఎదురు చూస్తూ వుంటారు".

"నిజమే నాకు రాయాలని ఉంటుంది. కానీ టైం చాలదు... అయినా నా కిది ప్రొఫెషన్ కాదుగా. ఏదో సరదాగా కాలక్షేపం కోసం రాస్తున్నాను- టిన్‌పాట్ స్టోరీస్ "

అహమ్మద్ మాటల్లో అహంకారంలేదు. అతను ఖచ్చితంగా రాణించగలడనుకుంది, సుమిత్ర. మంచి రచయితతో తనకు స్నేహం లభించినందుకు గర్వపడింది.

తర్వాత – అహమ్మద్ తను రాసిన కథల వెనుక కథల్ని చెప్పాడు. ఆ కథలు రాయడంలో అతను ఎలాంటి యిన్స్పిరేషన్ పొందింది జ్ఞాపకం చేసుకున్నాడు. పాఠకులు మంచి ప్రశంసలు యిస్తే, పత్రికలవాళ్ళు మంచి పారితోషికాలు యిచ్చారన్నాడు. కొన్ని మేగజైన్లు రచయితకి డబ్బులివ్వకుండా ఎగవేస్తారని కూడ చెప్పాడు. సుమిత్రకి తెలియని కొత్త విషయాలు ఎన్నో చెప్పాడు.

"అవునూ? నాతో మీరు చాలవిషయాలు మాట్లాడాలన్నారు. ఏవిటో చెప్పండి?" గుర్తొచ్చి సుమిత్ర అడిగింది.

అహమ్మద్ చాలాసేపు మాట్లాడలేదు. అతని అంతరంగ కథనం వేరు. ఆ కథనం వినిపించాలని సుమిత్రని పిలిచాడు. కానీ, ధైర్యం చాలక, ఆమె మీద తన కున్న అభిప్రాయం వెల్లడి చేయలేకపోయాడు. మనసు పీకుతుంటే, ఆ ప్రయత్నం మానుకున్నాడు. కథల్లోలాగ ఉత్తరం రాసి. ఆమె చేతికి ఏదో రోజున యివ్వాలనుకున్నాడు. మాటమార్చాడు.

"అబ్బే, ఏం లేదండీ? కథలు గురించి మాట్లాడాలని పిలిచాను. మీకు శ్రమ కలిగించాను. క్షమించండి."

"మిమ్మల్నొకటి అడుగుతాను. అభ్యంతరం లేకపోతే కాదనకుండా చెప్పండి." సుమిత్ర మెళ్ళో బంగారపు గొలుసును పంటితో నొక్కిపట్టి, అడిగింది.

# శ్రీమతి

అహమ్మద్ గుండెలు చిన్నగా కొట్టుకున్నాయి. సుమిత్ర తనని ప్రేమిస్తుందని చెబుతుందని ఆశ పడ్డాడు. ఆమె చెప్పే మాట విని, ఆమె చెక్కిలి ఎరుపు చేయాలని కోరిక పెంచుకున్నాడు.

"అడగండి. నా కెలాంటి అభ్యంతరమూ లేదు."

"మీ కలం పేరు 'శ్రీమతి' అని ఉంచటంలో ఉద్దేశ్యం ఏవిటండీ?"

అహమ్మద్ అవకాశాన్ని జారవిడుచుకోకూడ దనుకున్నాడు.

"చాలా మంచి ప్రశ్న వేశారు... మగవాణ్ని ప్రేమగా చూసుకోనే వాళ్ళు యిద్దరే. చిన్నతనంలో తల్లి తనకంటి రెప్పలా కాపాడుతుంది. తన బిడ్డకు ఏ కష్టం కలిగినా, ఆమె విలవిల్లాడి పోతుంది. పెళ్ళయిన తర్వాత తనభార్య తనప్రాణంలా చూస్తుంది తన భర్త కష్ట సుఖాల్లో పాలు పంచుకుంటుంది. అయితే– తల్లి ఆదరణ కొంత కాలమే లభిస్తుంది. అర్ధాంగి అనురాగం కలకాలం ఉంటుంది. అందుకే ప్రతిమగవాడు తనకు రాబోయే శ్రీమతి తనను అర్ధం చేసుకోవాలనీ, జీవితాంతం తనకు తోడుగా నిలవాలనీ ఆశపడుతాడు. నేనూ ఆశపడుతున్నాను. 'శ్రీమతి' పేరుతో కథలు రాస్తున్నాను."

అతని మాటలకి సుమిత్ర నవ్వింది.

"మీరు చాలా గడుసువారే. నిజంగా మీ బీబీ అదృష్టవంతురాలు"

"కాదు. కోరుకున్న బీబీ దొరికితే – నేనే అదృష్టవంతుణ్ని"

"విష్ యూ బెస్టాఫ్ లక్"

అహమ్మద్‌ఖాన్ అనుకున్నట్లు – అతన్ని ప్రేమిస్తున్నట్లు సుమిత్ర చెప్పలేదు. టైం అయిందని చెప్పి, వెళ్ళిపోయింది.

'శ్రీమతి' కొత్త కథలు వివిధ పత్రికల్లో వస్తున్నాయి. కాలేజీలో అమ్మాయిలకి, అబ్బాయిలకి అహమ్మద్ తెలిసిపోయాడు. అతనికి తెలియకుండానే చాలమంది అతని ఫాన్స్ అయిపోయారు. కొందరు లెక్చరర్లు కూడా అతనితో కథల గురించి ముచ్చటిస్తారు. సుమిత్ర సరేసరి అహ్మద్ కథల్ని కత్తిరించి, జాగ్రత్తగా దాచుకుంటుంది.

తన హృదయాన్ని కూడ కత్తిరించి, ఆకథలమధ్య పదిలంగా దాచుకోమని చాల సార్లు చెప్పాలని ప్రయత్నించాడు, అహమ్మద్. అవకాశం దొరకలేదు. అతను అడగలేదు.

* * *

వేసవి సెలవులు వచ్చాయి.

అహమ్మద్‌ఖాన్ వాళ్ళ తాతగారి ఊరు వెళ్ళిపోయాడు. సుమిత్ర తనను ప్రేమించిందంటే, అతను వెళ్ళేవాడు కాదు. సుమిత్ర తిరిగొచ్చేటప్పుడు ఒక నవలరాసి. అహమ్మద్‌ని

తీసుకురమ్మంది. ఈసారి పోస్టుచేసేముందు తనకు చదవటానికి యిమ్మని అడిగింది.

అలాగే అన్నాడు, అహమ్మద్ బరువుగా.

బరువుగా రైలు కదిలింది.

ఓరోజున సుమిత వాళ్ల బాబాయి శ్రీరామ్మూర్తి వచ్చి, అర్జంటుగా ఆమెను విశాఖపట్నం తీసుకుపోయాడు. అతని భార్యను కె. జి. హెచ్. గైనకాలజీలో చేర్పించటంచేత, ఇంట్లో పనులు చేయటానికి ఎవరూ లేరని, సాయంగా ఉంటుందని సుమిత్రను తీసుకువెళ్లాడు.

సుమిత వాళ్ల బాబాయి ఊళ్లో వేసవి కాలం చల్లగా ఉంది పదిగంటలకి ఇంట్లో వంటపని పూర్తయిపోయేది. పిల్లలు స్కూలుకి, బాబాయి ఆఫీసుకీ వెళ్లిపోగానే, సుమిత్ర భోజనం తీసుకొని, పిన్ని దగ్గరకి వెళ్లేది. అది చాల పెద్ద ఆసుపత్రి. ఎప్పుడూ జనంతో కిటకిట లాడుతుంది. పిన్ని ఉన్న వార్డులోనుంచి చూస్తే, దూరంగా సముద్రం కనిపిస్తుంది. పిన్నితో మాట్లాడినా, సముద్రంమీద వస్తున్న స్టీమర్లు చూసినా సరదాగా ఉంటుంది.

ఆఊళ్లో సుమిత్రకి అన్నపూర్ణ అనే స్నేహితురాలుంది. ఆ అమ్మాయి ఎప్పుడూ నవ్వుతుంది. నవ్విస్తుందికూడ. తీరిక సమయాల్లో ఎన్నో కబుర్లు చెప్పేది. ఊళ్లో వింతలూ విడ్డూరాలూ వివరించి, కథలుగా వినిపించేది.

వేసవి సెలవులు తొందరగా గడిచిపోతున్నాయేమోనని సుమిత బెంగపడింది.

సుమిత పిన్నిని డిస్చార్జ్ చేశారు. దబ్బపండు లాంటి పిల్లవాణ్ని తీసుకువచ్చింది. చంటివాడు 'ఉంగా ఉంగా'అని ఏడుస్తుంటే, సుమిత్ర కిలకిల నవ్వేది. 'నువ్వు పెద్ద రచయితవు కావాళిరా బాబూ' అని ముద్దు పెడుతుంది.

ఆరోజు ఆదివారం.

సుమిత్రా, అన్నపూర్ణా బీచ్‌కి వెళ్లారు. ఆ ఊళ్లో చెప్పుకోదగ్గ పార్కులుగాని, పార్కుల్లాంటివిగాని లేవు. అనంతమైన సముద్రం ఊరిని ఆనుకొని, యుగ యుగాల బంధాన్ని చాటుతుంది. సముద్రం పక్కన ఉద్యానవనంలా రామకృష్ణా మిషన్ బీచ్ ఉంది. వనదేవత వయ్యారంలా ఉన్న క్వార్టర్స్, కరినాగులా వంకర్లుపోయి, యూనివర్సిటీకి తోవతీసే తారు రోడ్డు, అంత దూరంలో అస్థి కత్యానికి అపురూపంగా నిర్మించిన రామకృష్ణా మందిరం, మరికొంచెం దూరంలో కొత్తగా వెలిసిన విశల మందిరం, దూరంగా కనిపించే అందమైన స్టీమర్లు, యారాడ కొండమీద వెలుగులు వెదజల్లే లైటుహౌసూ బీచ్‌కి అందం తెచ్చాయి.

అందమైన ఆ వాతావరణాన్ని చాలా సేపట్నుంచి సుమిత్ర చూస్తుంది.

"ఒరేయ్, అన్నయ్య ... ఇలారా ..."

## శిశిరం లో ...

సగటు మనిషి జీవితం

సన్నగా మిన్నగా వణుగుతోంది
సమస్యల సాగరంలో
సరిపడని రాగంలో పాడుతోంది
ఆశచేసే ధ్వని, నిరాశచేసే ప్రతిధ్వని
అనురాగాలు, భవబంధలూ
పురోగమనంపై యవనికలు.
చేసే ప్రతి వ్యాపారం
నష్టంతోనే ప్రారంభం
ప్రగతికి వేసే ప్రతి నిచ్చెన
పాకుడురాళ్లపై వేసిన అడుగు.
నిన్నలాంటిదే నేడుకూడ
మార్పులు చేర్పులు లేవు
రేపు యిదే వరస.
సమత ... సమానత
బ్రతుకుపై బాధల బురద
బ్రతుకులో అప్పుల రొద
వసంతాలు సున్న
శిశిరాలు మిన్న
జీవితం ముత్యాల సరమూ కాదు
ముదితలు పెట్టే ముగ్గుల దండాకాదు.
ముళ్లపొదల్లో సుదీర్ఘ ప్రయాణం.
మార్పుకోసం చేసే పోరాటం'.

— చెల్లూరి సీతారాజేశ్వరరావు

అన్నపూర్ణ వెళ్లిపోతున్న ఓ యువకుణ్ని కేకేసింది. సుమిత్ర తలెత్తి చూసింది.

"హాయ్ షిబ్ శంకర్ పత్నీ..." హిందూస్తానీ ఫక్కీలో అతను పరామర్శించడం. సుమిత్ర నవ్వింది.

"సుమిత్రా! వీడిఫోజు చూసి, వీడెవడో సినిమా హీరో అనుకునేవు ... కాదు ... మా కజిన్. పేరు రామకృష్ణ. సాయంత్రం అయితే ఈ రామకృష్ణా బీచే వీడి అడ్డాసు" అన్నపూర్ణ రామకృష్ణని సుమిత్రకి పరిచయం చేసింది.

సుమిత్ర, రామకృష్ణ ఒకర్నొకరు విష్ చేసుకున్నారు.

రామకృష్ణని మళ్లీ మళ్లీ చూడాలనిపించింది, సుమిత్రకి. చక్రాల్లాంటి అతని కళ్లలో ఆకర్షణ ఉంది. ఎర్రని పెదవుల మీద చిరునవ్వులదొంతరలున్నాయి. అందగాడు ఆరోగ్యంగా కనిపించాడు.

"అన్నయ్యా నీకేపని లేనట్లుంటే; కాసేపు కూర్చొని, మాతో కబుర్లు చెప్పకూడదూ?"

"అయ్యో పాపం! ఏమయిందీ నీకు?"

"ఏమీకాలేదు, చిట్టి తండ్రీ! మా సుమిత్రకి కథలంటే చాల యిష్టం. కథలు రాసేవాళ్లంటే చాల చాల యిష్టం ... నువ్వేమో క్యాబేజీ తరిగినట్లు కథలు రాసేస్తావు. సుమిత్ర ఏమో కరకజ్జం తిన్నట్లు చదివేస్తుంది. మీ యిద్దరూ మాట్లాడుకుంటే వినాలని నాకు సరదాగా ఉంది.'

"మీరు కథలు రాస్తారా?" సుమిత్ర — రామకృష్ణ కథలు రాస్తాడని తెలిసి, ఆతృతగా అతన్ని అడిగింది.

"ఏదోలెండి ... అప్పుడప్పుడు సరదాగా రాస్తుంటాను." రామకృష్ణ యిబ్బందిపడిపోయాడు. ఇసుకలో చతికిలబడ్డాడు. అతనితో కథల గురించి చర్చించాలని సుమిత్ర ముచ్చటపడింది.

"సుమిత్రా! మా అన్నయ్య సరదాగా రాస్తున్నట్లు చెబుతున్నాడు గాని వాడు రాసిన కథల్లో కన్నీళ్లు తప్ప మరేమీ వుండవు. వాడి కథల్లో ఒక పాత్రయినా 'చావుల మందుం'కి వెళ్లకుండా వుండదు."

అన్నపూర్ణ చెవి మెలిపెట్టేడు,రామకృష్ణ.

"మీరు ఏ పేరుతో కథలు రాస్తుంటారు?" సుమిత్రకి కుతూహలంగా ఉంది.

రామకృష్ణ నవ్వి ఊరుకున్నాడు. ఏ పేరుతో రాస్తున్నదీ చెప్పలేదు.

"చూడు సుమిత్రా! వాడు సిగ్గు పడుతున్నాడు. నే చెప్తాను. విను... ఎవరైనా పెళ్లయిన తర్వాత పెళ్లాం కొంగు పట్టుకు తిరుగుతారు. పెళ్లాం అంటే పడి ఛస్తారు. కానీ, మా అన్నయ్య మాత్రం పెళ్లి కాకుండానే పెళ్లాం అంటే పడి ఛస్తున్నాడు. తనకు కాబోయే పెళ్లాం పేరు తెలీక, ప్రస్తుతానికి 'శిశిర' అనే పేరుతో కథలు రాస్తు

న్నాడు, వాడికథలు నువ్వు చదివే ఉంటావు" రామకృష్ణని ఎగతాళి చేస్తూ, అన్నపూర్ణ చెప్పింది.

సుమిత్ర ఆశ్చర్య పోయింది.

అహ్మద్‌ఖాన్‌కి పోటీగా మరో శ్రీమతి కాదుకదా? లేక శ్రీమతి కథలన్నీ తనే రాశానని అబద్ధంగా ప్రచారం చేసుకోవటం లేదు కదా?' మనసులో అనుకుంది.

"మీరు రాసిన కొన్ని కథలు చెప్పండి." సందేహంగా అడిగింది.

అతను సమాధానం యివ్వకముందే— అన్నపూర్ణ చెప్పింది.

"ఫస్ట్ లవ్... లాస్ట్ కేస్..." వగయిరా ...వగయిరా... ఇవి మచ్చు తు న క లు మాత్రమే."

సుమిత్రకి కోపం వచ్చింది. అహమ్మద్ కథల్ని తన రచనలుగా చెప్పుకుంటున్న రామ కృష్ణ రెండు చెంపలు వాయించి, బుద్ధి చెప్పాలనిపించింది. 'శ్రీమతి' తనే అని ప్రచారం చేసుకోవడంలో అతని అంతర్యం ఆమెకి అర్థం కాలేదు. ఇందాక అందంగా కనిపించిన అతని ముఖంమీద వెలుగు నీడలు పడి అసహ్యంగా కనిపిస్తున్నాడు.

"అన్నపూర్ణా! మీ అన్నయ్య చాలా తెలివైన వాడు. మిమ్మల్ని తెలివిగా చక్కగా మోసం చేస్తున్నాడు"

సుమిత్ర మాటలకి రామకృష్ణ అదిరి పడ్డాడు. అన్నపూర్ణ విస్తుపోయింది ఆమె మాటలు అర్థంకాలేదు

"శ్రీమతి పేరుతో కథలు రాస్తున్నది తనేనని ప్రచారం చేసుకుంటున్నాడు కాబోలు అబద్ధపు రచయితగా మీ అందరి మెప్పు కోసం చెలామణి అవుతున్నట్లుంది. అదో రకమైన మానియా' సుమిత్రఆవేశంగా అంది.

"సుమిత్రా! నీకు మతిపోయిందా? మా అన్నయ్య అల్లరి చేస్తాడేగాని అబద్ధాలు చెప్పడు. వాడు ఎవరి మెప్పుకోసం అబద్ధపు రచయితగా చెలామణి అవటంలేదు మా అన్నయ్యకి టాలెంట్సున్నాయి. ఎవరి కథల్నో తనవిగా చెప్పుకొనే దౌర్భాగ్యం వాడికి లేదు." సుమిత్ర — రామ కిష్ణని కించపరచటం అన్నపూర్ణకి నచ్చలేదు. గట్టిగా మాట్లాడింది.

"నాకు మతి సరిగా పని చేస్తుంది. శ్రీమతి పేరుతో కథలు రాస్తున్న ఆ రచయిత మా కాలేజీలో చదువుతున్నాడు అతని

# శ్రీమతి

అసలు పేరు అహమ్మద్ ఖాన్. ఇందాక నువ్వు వర్ణించావ్ ... ఆ కథలన్నీ అతను రాశాడు. అతనికి మా కాలేజీలోనే కాదు అన్ని పత్రికల్లో ప్రత్యేకమైన స్థానం ఉంది" సుమిత్ర ఘంటాపథంగా చెప్పింది.

రామకృష్ణకి అసలు విషయం కొంచెం కొంచెం అర్థం అవుతుంది. తెల్లబోయి,



ఆమెను చూస్తూ ఉండిపోయాడు.

"నువ్వు పొరపడుతున్నావు, సుమిత్రా" అన్నపూర్ణ అంది.

"నేను పొరపడలేదు — మీ అన్నయ్య గ్రహపాటు బాగులేదు అందుకే నా చేతిలో చిక్కిపోయాడు.. రచనలు దొంగతనం చేసిన వాళ్ళుంటారని తెలుసుగాని ఇలా మీ అన్నయ్యలా పేరు దొంగిలించి,ఆ రచయిత తనేనని ఫోజుగా చెప్పుకొనే వాళ్ళుంటారని ఊహించ లేదు పాపం బద్దలయినప్పుడు నిజం బయట పడుతుంది."

సుమిత్ర-అహమ్మద్‌ఖాన్ గురించి, అతని కథల కమామీషూ గురించి వివరంగా చెప్పింది. రామకృష్ణ విని, పేలవంగా నవ్వేడు.

"మీ అన్నయ్య ఏదో ప్రత్యేకత కోసం 'శ్రీమతి' పేరుతో రచనలు సాగిస్తున్నట్లు మీ అందరితో చెప్పుకుంటున్నాడు. కాదని అతన్ని గుండెలమీద చెయ్యేసి చెప్పమను.': సుమిత్ర ఛాలెంజీ చేసింది

అన్నపూర్ణ సహించలేకపోయింది.

"అన్నయ్యా! నిజం చెప్పు. శ్రీమతి పేరుతో కథలు రాస్తున్నది నువ్వుకాదు ?" ఉక్రోషంగా అడిగింది.

రామకృష్ణ మౌనంగా ఉండిపోయాడు. 'అవునూ కాదూ' అని తేల్చిచెప్పలేదు జ్ఞానిలా భావయుక్తంగా నవ్వుతూ ఉండిపోయాడు.

"మీరు నవ్వకూడదు, సిగ్గుపడాలి. ఎవరో రచనల్ని మీవని చెప్పుకొని, ఆత్మ వంచన చేసుకుంటున్నారు అందర్నీ నమ్మించి, మోసం చేస్తున్నారు కథలు రాయాలనే అభిలాష ఉంటే, కృషి చేయాలి ఇటువంటి కాని పనులు చేయటం ఒంటికి మంచిది కాదు" సుమిత్ర అక్కడ నుండి లేచి, విసురుగా వెళ్లి పోయింది.

ఆ అందమైన అమ్మాయి కోపం కూడ రామకృష్ణ కళ్ళకి అందంగా కనిపించింది. ఆమె కట్టుకున్న నీలిరంగు చీర నీలి దీపాల కాంతిలో మిలమిల మెరుస్తుంది ఆమెవెళ్ళిన వేపు చూస్తూ విరగబడి నవ్వేడురామకృష్ణ.

అన్నపూర్ణకి కోపం వచ్చింది. రామ క్రిష్ణని నిలదీసింది. నవ్వటం ఆపి, నిజం చెప్పమని కసురుకుంది

"అమ్మలూ నిజా నిజాలు ఆ పైవాడికి తెలియాలి. ప్రస్తుతానికి నన్నేమీ అడగొద్దు. మీ సుమిత్రగారు అన్నట్లు నా గ్రహపాటు బాగులేదు." రామక్రిష్ణ బారంగా నిట్టూర్చాడు.

ఆ సంఘటన జరిగిన వారం రోజుల తర్వాత—

సుమిత్రా వాళ్ల బాబాయి శ్రీరామమూర్తి ఓ సాయంత్రం రామకృష్ణని ఇంటికి తీసుకు వచ్చాడు. కాఫీ తీసుకు రమ్మని సుమిత్రకి చెప్పాడు. కాఫీ తీసుకువచ్చిన సుమిత్ర— అతన్ని చూసి ఆశ్చర్యపోయింది. ఆమెనుచూసి అతను నిర్ఘాంతపోయాడు

"బాబాయ్, అతను మీకు తెలుసా?"

# గొప్ప సంధానకారి



సర్‌సిల్క్. దృష్టినాకట్టే ఉత్తేజకరమైన ముదురు రంగులలో. చక్కని లేత రంగులలో. సాదా, దారలు మరియు గీతలలో.

సర్‌సిల్క్ నాణ్యమైన గుడ్డలలో మీరు కోరేవన్నీ సమకూర్చే సూటింగులు మరియు షర్టింగులు మీకు చేకూర్చ గలదు. మన్నిక గలవి. మంచి నాగరికతాభిరుచులకు దీటైనవి వాడకానికి తేలిక, సరిగ్గా సక్రమమైన ధర,







**సర్‌సిల్క్**
**పాలియెస్టర్**
**సూటింగులు**
**మరియు షర్టింగులు**

సెల్లింగ్ ఏజంట్లు: ఆంధ్ర ప్రదేశ్: కలకత్తా మర్చంట్స్ & ఏజెంట్స్ (ప్రై) లిమిటెడ్, 11-41-51, కందుల వారి వీధి విజయవాడ. తెలంగాణ: సింగ్లా & కో. పథేర్ గట్టి, హైదరాబాదు. కర్ణాటక: మోడరన్ డీలర్స్ (ప్రై) లిమిటెడ్, కెంపెగౌడ రోడ్, బెంగుళూరు. తమిళనాడు & కేరళ: హిందుస్థాన్ డీలర్స్ లిమిటెడ్, 4, స్ప్రింగర్ స్ట్రీట్, మద్రాసు.

శ్రీరామ్మూర్తి చేతికి కాఫీ అందిస్తూ సుమిత్ర నెమ్మదిగా అడిగింది.

"అదేవిటి, సుమిత్రా? మనకు బాగా కావలసినవాడు. పేరు రామకృష్ణ. రిసర్చ్ స్కాలర్... నీకూ తెలుసా?" అని శ్రీరామ్మూర్తి సందేహంగా అడిగాడు.

"ఓ, బాగా తెలుసు బాబాయ్... శ్రీమతి అనే పేరుతో కథలు రాస్తుంటారు. రచయితని అందరూ తెగ మెచ్చుకుంటారు." సుమిత్ర వ్యంగ్యంగా అంది.

"వెరీగుడ్. రామకృష్ణ నీకు బాగా తెలుసన్నమాట... ఆ కథలూ కాకరకాయలూ మనకు తెలీవు. నాకు తెలిసిందల్లా ఒక్కటే. మీరు యిష్టపడితే— ఇద్దరికి ముడిపెట్టటానికి మా పెద్దవాళ్లం సిద్ధంగా ఉన్నాం. ఈ అవకాశం కల్పించాలనే రామకృష్ణని తీసుకువచ్చాను. మీకు ఒకరికొకరు ముందే తెలుసునని. ఈ అవసరం ఉండదని నాకు తెలీదు" శ్రీరామ్మూర్తి మనసులో ఏమీ దాచకుండా మాట్లాడేడు.

సుమిత్ర మండిపడింది.

"బాబాయ్! నా కిష్టంలేదు. అందమైన అబద్ధాలతో బతకటం, మనుషుల్ని మోసం చేయటం అతనికి అలవాటు. అతనిఅలవాట్లు తెలుసుకున్న తర్వాత— ఎవరూ క్షమించలేరు. అతన్ని వెళ్లిపోమని చెప్పండి."

రామకృష్ణ ఆమె మాటలకి నొచ్చుకోలేదు. చిన్నగా నవ్వేడు. కాఫీ తీసుకోకుండా లేచి వెళ్లిపోయాడు.

సుమిత్రమీద శ్రీరామ్మూర్తి కసురుకున్నాడు. సుమిత్ర జరిగినదంతా చెప్పింది. అయినా శ్రీరామ్మూర్తికి తలకెక్కలేదు.

* * *

కాలేజీ తెరిచిన తర్వాత— అహమ్మద్ ఖాన్‌తో 'డూప్లికేట్ శ్రీమతి' గురించి చెప్పింది. అతన్ని ఎలా ఎటాక్ చేసింది కూడ చెప్పింది.

"చూడండి! అతను మీ పేరు చెప్పుకొని పేరు సంపాదిస్తున్నాడు. మీ కథలన్నీ అతనే రాసినట్లు అక్కడ వాళ్లంతా నమ్ముతున్నారు. మీరతన్ని క్షమించ కూడదు. గట్టిగా బుద్ధి చెప్పండి."

అహమ్మద్ ఖాన్ ఆలోచనలో పడ్డాడు.

"లాయర్ నోటీసిచ్చి. కోర్టు కీడ్చండి. అతని రోగం కుదురుతుంది. లేదా అతను పాగిస్తున్న నిర్వాకాన్ని యితివృత్తంగా చేసుకొని, ఓ కథరాసి, దీపావళి కథల పోటీకి పంపండి. రంగు బయట పడితే బేరు మంటాడు." సుమిత్రకి నిద్దరలో కూడా రామకృష్ణ గుర్తొస్తున్నాడు అతనికి తగిన గుణపాఠం చెప్పాలని ఉక్రోషంగా ఉంది.

# శ్రీమతి

"బావుందండీ కథ చాల చక్కగా రాయొచ్చు. కానీ. మనకథకి ప్రైజొస్తుందని మనం ఎలా అనుకోగలం ... అయినా, మీరతనికి బుద్ధిచెప్పారుగా చాలు. మళ్లీ అల్లా చెప్పుకు తిరగడు." అహమ్మద్ అంతగా పట్టించుకోలేదు.

"అలా తోసిపుచ్చకండి. మీరు కథ రాసి పంపిస్తే తప్పకుండా ప్రైజొస్తుంది. నామాటవిని, పోటీకి కథ పంపండి. 'శ్రీమతి' మీరేనని అందరికీ తెలుస్తుంది."

"మీమాట ఎలా కాదనగలను ? తప్పకుండా ప్రయత్నిస్తాను" అహమ్మద్‌ఖాన్ — కథలో మలుపుకోసం దీర్ఘంగా ఆలోచించాడు.

* * *

మూడు నెలలు గడిచాయి

ఓ ప్రముఖ వారపత్రిక నిర్వహించిన దీపావళి కథల పోటీలో 'శ్రీమతి' రాసిన కథ మొదటి బహుమతి గెలుచుకుంది. కథ పేరు 'రచయిత కథ' వారపత్రికలో కథను చూసి సుమిత్ర పొంగిపోయింది. అహమ్మద్ కథ రాసి, పోటీకి పంపినట్లు తనకు చెప్పలేదు. బహుశా తనను ఆశ్చర్యపరచాలని చెప్పలేదు గాబోలు.

కుతూహలంగా మొదట కథ చదివి, బోలెడంత ఆశ్చర్యపోయింది. తను చెప్పిన విషయాన్ని పొందికగా అల్లికచేసి, చక్కని కథగా రూపొందించాడు, అహమ్మద్. సుమిత్ర సంతోషం పట్టలేక పత్రికని ముద్దు పెట్టుకుంది.

అహమ్మద్‌ఖాన్ ఫోటో చూడాలనీ, అతని పరిచయం చదవాలనీ పత్రిక పేజీలు ముందుకి తిప్పింది, సుమిత్ర.

సుమిత్ర వారపత్రిక తీసుకొని, అహమ్మద్ దగ్గరికి వెళ్లింది.

అహమ్మద్‌ఖాన్ ప్రేమలేఖ తయారు చేస్తున్నాడు. సుమిత్ర లేకపోతే తను బ్రతకటం కష్టమని. తనని కనికరించి, ప్రేమించమని రాశాడు. సుమిత్రని చూడగానే అతనికి ధైర్యం వచ్చింది. క్షణం ఆలస్యం కాకుండా, రాసిన ప్రేమలేఖను ధైర్యంగా సుమిత్ర చేతికి అందించాడు.

> కష్టపడి పని చేయండి.
> దేశానికి మేలు చేయండి.

సుమిత్ర ఉత్తరం చదువుకుంది.

"మొదట నా కంగ్రాచ్యులేషన్స్ అందుకోండి... మీరు రాసిన కథకి మొదటి బహుమతి వచ్చింది. ఈ పత్రికలో మీ ఫోటో వేశారు చూసుకోండి... పాపం ! మీ కాపీ యింకా పోస్టులో రాలేదనుకుంటాను." అతని ముందుకి వారపత్రిక విసిరింది.

అహమ్మద్ ఫొటో చూసి, కంగారు పడ్డాడు. కొత్తకథ అల్లటానికి వీలుపడక, సుమిత్రవేపు చూడలేక, తలవంచుకున్నాడు.

సుమిత్ర — అతని రెండుచెంపలు ఛెళ్లు మనిపించింది.

"ఈ రోజు నీ పాపం పండి నిజం బయట పడింది. ఇంతకాలం నీ బూటకపు మాటలు నమ్మి నువ్వొక రచయితవని, గొప్ప మనిషివని నమ్మి, నీతో స్నేహం చేశాను. నీలో నీచమైన ఆలోచనలు ఉన్నాయని. నన్ను మోసం చేస్తున్నావని ఊహించలేదు." ఉత్తరం చింపి, అతని ముఖం మీదికి విసిరి సుమిత్ర చరచరా వెళ్లిపోయింది.

* * *

"నన్ను క్షమించండి. మిమ్మల్ని తప్పగా అంచనావేసి, అనరానిమాట లన్నాను. నా తెలివితక్కువకి సిగ్గుపడుతున్నాను!" పౌరాణి ఆరని అతని పాదాలమీద సిగ్గుపడుతూ వాలిపోయింది, సుమిత్ర.

"నో... నో... ఇప్పుడు క్షమించడాలు బిజినెస్ పెట్టుకుంటే, ఈ రాత్రి గడుసుగా జారుకుంటుంది. సుమిత్రా?" కొత్త పెళ్లికూతుర్ని పొదివి పట్టుకొని, కౌగిల్లోకి తీసుకున్నాడు, రామకృష్ణ.

ఆమె— అతని గుండెలమీద వాలిపోయింది

"ఈ శుభ సమయంలో ఖాన్ బాయ్‌కి నా థాంక్స్ చెప్పుకోవాలి. ఖాన్ భాయ్ లేకుంటే — నాకీ అదృష్టం వుండేది కాదు. ఖాన్ భాయ్ వలన కథ రాశాను. బహుమతి కొట్టేశాను. ఓ రాజకుమారిని సంపాదించుకున్నాను. ఇన్ని విజయాలకి కారణమైన ఖాన్ భాయి..." తను క్రిష్ణని మాట్లాడనివ్వకుండా, సుమిత్ర అతని పెదవులకి తన పెదవులు అందించింది.

ఎప్పట్నించో వాళ్లిద్దర్ని గమనిస్తున్న చందమామ 'గుడ్‌నైట్' చెప్పి, మబ్బుల చాటుకి వెళ్లిపోయాడు.

# దుర్వాసనే ఎడబాటుకు కారణం...





## కాల్గేట్ పరస్పర అన్యోన్యతకు కీలకం






## కాల్గేట్ డెంటల్ క్రీమ్‌తో నోటి దుర్వాసనను ఆపండి...రోజంతా దంతక్షయాన్ని నివారించండి!

కాల్గేట్ 10 మందిలో 7 గురికి వెంటనే నోటి దుర్వాసనను నివారించినదని, భోజనము అయిన వెంటనే కాల్గేట్ పద్ధతిలో పళ్లు తోముకొంటే ఎక్కువ దంతక్షయమును, ఎక్కువ మందికి అరికట్టినదని దంతశాస్త్ర చరిత్రలో పూర్వము ఎప్పుడూ ప్రకటింపబడనట్లు శాస్త్ర పరీక్షలు నిరూపించేయి. ఎందుకంటే: కాల్గేట్ డెంటల్ క్రీమ్‌తో ఒకసారి పళ్ల తోముకొండే 85% వరకు నోటి దుర్వాసన మరియు దంతక్షయమును కలిగించే సూక్ష్మ క్రిములు పోతాయి. ఎంత చక్కని పెప్పర్‌మెంట్ రుచి కూడ ఉంది—కాల్గేట్ డెంటల్ క్రీమ్‌తో రోజూ పళ్లు తోముకొనుటకు పిల్లలు యిష్టపడతారు!

శుభ్రమైన, తాజా శ్వాసకు మరియు తెల్లగా మెరిసే పళ్లకు...

ఎక్కువ మంది జనులు ప్రపంచములో ఏ యితర టూత్‌పేస్ట్ కంటే కాల్గేట్‌నే కొంటారు

## నీళ్లపై కంట్రోలు

ఇటాలియన్ పట్టణాలకు నీటి కరువు వచ్చిందట. ఇటలీలో నూ, సార్డీనియాలో నూ జనం "నీళ్లు కావాలి. మాకు దాహం దాహమోయ్!!" అంటూ నినాదాలు చేసి ఊరేగింపుగా కూడా వెళ్లారట. పాలెర్మోలో నీటి కుళాయిలు వేలపైగా ఎండి పోయాయట. ఈ పరిస్థితి నదుపులోకి తేడానికి ప్రభుత్వం నీటి మీద కంట్రోలు తెచ్చి, చెరువుల మీద, బావుల మీద చేతులువేసి నీటిని ఎక్కువ ధరకు అందరికీ దొరికేలాచూస్తోందట.

## జైల్లో చనిపోయిన నిర్దోషి

వాషింగ్టన్ జైలులో లారీజోన్స్ అనే 25 ఏళ్ల యువకుడు తన శిక్షకు ఏ విచారణా లేకుండా ఎనిమిది నెలలు వున్నాడట. విచారణ లోపున చనిపోయాడుట. అనంతరం ఒడ్డి హెరాల్డ్ గ్రీనా యీ కేసు విచారించి లారీజోన్స్ మీది కేసు కొట్టేశారట. అంతేగాక లారీజోన్స్ మరణం పట్ల తాను విచారించి యిక ముందిలాటి పొరపాట్లు జరుగరాదు అన్నారట.

## ఆడవారితో పోస్టాఫీసు

అందరూ ఆడవారే పనిచేసే పోస్టాఫీసు ఆంధ్రప్రదేశ్‌లో ప్రప్రథమంగా హైదరాబాద్‌లోని రీజనల్ రిసర్చి లేబరేటరీస్ ప్రాంతంలో ప్రారంభించారట. మహిళా సంవత్సరంకదా మరి! ఆ తర్వాతా పోస్టాఫీసు! పోనీలెదేండెదు. ఇప్పట్టి దర్శిత్వెప్.

## దేవుడిపై వాస్తుశాస్త్ర ప్రభావం!

భద్రాద్రి రాముడి గుడి నిర్మాణం వాస్తుశాస్త్ర ప్రకారం సరిగాలేదని, అందువల్లనే ఆ దేవాలయపు ఆర్థిక పరిస్థితులు అలా వున్నాయని, ఉత్తరప్రదేశ్ గవర్నర్ ఎం.చెన్నారెడ్డిగారు అంటూ, యీశాన్యం వైపు ముఖ ద్వారాన్ని ఏర్పరచాలని, అచోట వో బావిని త్రవ్వించాలనీ కూడా సూచన చేశారట.

## స్త్రీ నిరక్షరాస్యుల పెరుగుదల

ప్రపంచ జనాభాలోని ఎనభై కోట్ల మంది అక్షరజ్ఞానం లేనివారేనట. ఈ ఎనభై కోట్లలో అరవై శాతం స్త్రీలు వున్నారట. 1960 నుంచి 1940 వరకూ చూసిన లెక్కలవల్ల స్త్రీలలో అక్షరజ్ఞానం లేనివారిసంఖ్య నాలుగు కోట్లు పెరిగిందని, అదాలంలో పురుషుల సంఖ్య ఎనభై లక్షలు పెరిగిందని ప్రపంచ విజ్ఞాన సమితి డైరెక్టరు అన్నారట. . .

## స్కూలుకురాని మాస్టర్ల తొలగింపు

యలమంచిలి పంచాయతీసమితికి చెందిన హరిపాలెం అనే వూరిలోని వో ఎలిమెంటరీస్కూలు హెడ్మాస్టరునూ, మరోయిద్దరు ఉపాధ్యాయులను పనినుంచి జోగిరాజు అనే బ్లాక్‌డెవలప్‌మెంటు ఆఫీసరుగారు తొలగించారట. ఆయన ఆ స్కూలుకు వెళ్లినపుడు ఆ ముగ్గురూ స్కూలులో లేరట. వారు శలవు దరఖాస్తులు కూడా స్కూలులో లేవట— తస్మాత్. . జాగ్రత!

* * *

ప్రొద్దుటూరు మునిసిపల్ ఆఫీసు మేనేజరు ఎస్. ఎ. గఫూర్ పదోతేదీ మధ్యాహ్నం ఆఫీసు నుంచి యింటికి వెళ్తుండగా దారికాచినవారెవరో ఆయన్ని కొట్టి పారిపోయారట. కొన్ని గాయాలతో ఆయన ప్రాణాపాయాన్ని తప్పించుకున్నారట.

## 30 సం.ల సర్వీసులో శెలవన్నది పెట్టలేదు!

నందికొట్కూరు తాలూకాకుచెందిన మడుగుల అనే వూరిలో వో పాఠశాలలోని ప్రధాన ఉపాధ్యాయుడు గత ముప్పయి సంవత్సరాలుగా ఒక్కరోజు అయినా శలవు పెట్టనే లేదట.

## కరెంటుషాకుతగిలి మరణం

నంద్యాలలో పాలిటెక్నిక్ రెండో ఏడు చదువుతున్న విద్యార్థి 21 ఏళ్ల నాగరాజు వో రేడియో రేడియో షాపులో పరీక్షిస్తుండగా కరెంటు షాకు తగిలి అక్కడికక్కడే చనిపోయాడట.

(46 వ పేజీ చూడండి)

### ఎలక్ట్రిక్ ఎండుగడ్డి

విద్యుత్తు ప్రసారం దెబ్బ తగిలినట్లయితే మొక్క ఎండిపోతుంది. ఈ ఫలితాన్ని ఒక లిథుయేనియన్ విజ్ఞాన శాస్త్రజ్ఞులు, రూప కల్పనాకారుల బృందం ఎండుగడ్డి నితయారు చేసే పద్ధతిని రూపొందించడానికి ఉపయోగించారు. ఇది బాగా త్వరగా జరుగుతుంది. వాతావరణం మార్పులు పైని ఆధారపడదు. పీరు రూపకల్పన చేసిన యంత్రంలోని పచ్చిగడ్డిని కన్వేయరు బెల్టు తీసుకపోతుంది. ఒక వెయ్యివోల్టుల విద్యుత్తు ప్రసారానికి గురి చేయబడిన తరువాత అది తీసుకపోబడుతుంది. వెంటనే గడ్డి ఎండిపోవడం జరుగుతుంది. విద్యుత్తు ఎక్కువ నాణ్యమైన ఎండుగడ్డిని తయారు చేస్తుంది. అందులోని విటమిన్లు, కార్బోహైడ్రేట్లు భద్రంగా ఉంటాయి.

ఉక్రెయిన్ సోవియెట్ సోషలిస్టు రిపబ్లిక్ పోల్టావా వ్యవసాయ విద్యా సంస్థ పరిశోధకులు, విద్యుత్తు ప్రసారాలతో కాల్చడం ద్వారా కలుపు నాశనం చేయగల ఒక యంత్రంను పొలాలలో పరీక్ష చేశారు.

ఈ రోజుల్లో సోవియట్ వ్యవసాయం విద్యుత్తును సుమారు 300 రకాలుగా వుపయోగిస్తోంది.

# డాక్టరు సలహాలు

## డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

**యం ఆర్ – సికింద్రాబాద్**

నా వయస్సు 35 సం. లు. వివాహమై 9 సం.లు. సంతానము కలుగలేదు. సీమెను టెస్టులో మొటిలిటి 25 శాతం స్పెర్మ్‌లసంఖ్య 38.4 మిలియన్లు, ఫెర్టిలిటీ ఇండెక్స్ తక్కువ అని తేలింది. సంతానం కలిగే అవకాశముందా?

సంతానోత్పత్తికి కావలసింది ఒక 'స్పెర్మ్" మాత్రమే! కాని 800 నుంచి 900 లక్షల "స్పెర్మ్స్" ఒక సి. సి. సెమెన్‌లో ఉండటం (మామూలు వారిలో) అయినా సంతానోత్పత్తి జరగక పోవటం ఆశ్చర్యం కలిగిస్తుంది కదా! గర్భం రావటం, స్పెర్మ్‌ల సంఖ్య మీద, వాటి చలనం మీద ఆధారపడి ఉంటుంది.

మీకు సంతానం కలిగే అవకాశం మీలాంటి ఇతరులకన్నా చాలా ఎక్కువ అనే చెప్పాలి.

**వి. –చీర్యాల**

నావయస్సు 20 సం॥ 4 సం.లుగా ముక్కులో రక్తము వస్తోంది. 15రోజులకొకసారి యిలా జరుగుతోంది.

మీ వయస్కులలో ముక్కులో తరచూ నెత్తురు కారటం ముఖ్యంగా, రక్తనాళముల కూడిక— అంటే— వైద్య రీత్యా "హిమాంజియోమా" అనే రోగం వల్లవిటమిన్ 'సి'లోపం వల, ముక్కులో అదనంగా "కండ" (పాలిప్) పెరగటం వల్ల, జరుగుతుంది.

మీరు దగ్గరలో ఉన్న —"ఇ. ఎన్. టి." వైద్యులను సంప్రదించండి. వారు రోగ ర్ధారణ చేసి దానికి తగిన చికిత్స చెప్పగలుగుతారు.

**ఆర్. – చీరాల**

గర్భ సమయంలో కాళ్ళ చేతులు వాయుటం జరిగి మందులు వాడుతున్నప్పుడు కోర్సు పూర్తి కాక ముసుపే నోటి వెంట నురగలు కక్కుతూ, మంచం మీది నుండి పడి అపస్మారక స్థితికివచ్చిన ఒక రోగికి బ్లడ్‌ప్రెషర్, పల్సు ,కండ్ల పరీక్ష,, ఫుర్రె ఎక్స్—రే పరీక్ష చేసి దోషమేమియు లేదని డాక్టర్ చెప్పినారు. ఆ రోగం ఎందువలన వస్తుంది? మరల అలా వచ్చే ప్రమాదముందా? వస్తే నివారణోపాయం తెలుపగలరు..

పై రోగాన్ని "ఎక్లాంప్సియా" అంటారు. ఈ రోగ సూచనలు తల్లి గర్భవతిగా ఉన్న సమయంలోనే కనపడటాన్ని — ప్రీ ఎక్లాంప్టిక్‌టాక్సీమియా"— అంటారు. ఈ రోగ కారణం 'ఇదని' ఇంతవరకూ తెలలేదు. అందువలన ఈ రోగం రాకుండా చూసుకొనటమే ప్రస్తుతం నమ్మకమైన మార్గము. ప్రతి నెలా వైద్యులచే పరీక్షించుకొనటం (కనీసం 5 వ నెల తర్వాత) మూత్ర పరీక్ష, రక్తపరీక్ష, రక్తపు పోటు, బరువు మొదలయినవి క్రమంగా పరిశోధించుకొంటే చాలా మటుకు ఈ రోగాన్ని అరికట్టవచ్చును.

**వి. – నూతలపాడు**

చిన్న పిల్లల అంగము ఏ సమయములోనూ లేచి వుండక పోయినచో పోను పోనూ పురుషత్వము లోపించునని విన్నాను. నిజమే అయిన దానికి చికిత్స తెలుపగలరు.

ఏదో కట్టుకథలు అవీ— ఇవీ, విని బుర్ర పాడు చేసుకుని, మా కాలం (సమయం) నా కాలం పత్రిక వారి "కాలం" (చోటు) వృధా చేయడం తప్ప— నాకు మీ సందేహానికి జవాబివ్వటం అనవసరం అనిపించినా ఇక ముందైనా ఇలాంటిప్రశ్న ఎవరూ వ్రాయకూడదనే ఉద్దేశంతో వ్రాయటం జరుగుతోంది.

చిన్న పిల్లల జననేంద్రియాల— లేపనశక్తికి వారు పెద్దవారైన తర్వాత ఏర్పడే పురుషత్వానికి సంబంధము లేదు— అలా సంబంధమేర్పరచటం హాస్యాస్పదం.

**ఆర్ – బిలాయ్**

మా బాబుకి 11 సం. లు. 4 సం. లవయస్సులో టాన్సిల్సు ఆపరేషన్ జరిగింది. అయినా యిప్పటికి తలంటుపోయగానే పడిశం జలుబుచేసి నోటిలోకి నీరు పోతుంది. గొంతు మంట, తుమ్ములు కూడా వస్తాయి.గొంతులో నీరువుండిపోయి రాత్రిళ్ళు నిద్రపట్టదు.

మన దేశంలో సాంప్రదాయకంగా వచ్చే కొన్ని ఆచార వ్యవహారాలలో ఈ "తలంటు" ఒకటి. తమకి పడదని తెలిసి కూడా ఆపద్ధతిని "పట్టువదలని విక్రమార్కునిలా"— ఆచరించటం మనలోని బలహీనతను మాత్రమే తెలియజేస్తుంది. "తలంటు"కు వాడే నూనెగాని, ఇతర వస్తువులు గాని, పడక పోతే, మీరు వ్రాసిన లక్షణాలు రావచ్చును. దీని మూలంగా మీరు బాధ తప్పించుకోవాలంటే— 'తలంటు' పోసుకోవటం మానటమో— లేక వాడే పదార్థాలను మార్చటమో చేయటం శ్రేయస్కరం.

**వి. గిద్దలూరు**

నాకు కుడిచేతి వేళ్ళు అరచేయి పై భాగమువాపుగా ఉండి "ఫైలేరియా"కు సంబంధించి ట్రీట్‌మెంటు తీసుకొన్నా, వాపు అలాగే ఉన్నది.

'ఫైలేరియా' అని రోగ నిర్ధారణ జరిగి, దానికి తగిన చికిత్స పొందినా వాపు ఏర్పడిన తర్వాత పెద్ద పెట్టున చేతితో తీసివేసినట్లుగా పోతుందనుకోవడం చాలా పొరపాటు.

'వాపు' అనేది ఏర్పడిన తర్వాత మరల్లా ఆ భాగం యథాస్థితికి వస్తుందని ఇంతవరకు ఎక్కడా నిరూపింపబడలేదంటే ఆశ్చర్యంకాదు.

ఆ వాపు పెరగకుండా ఉండటానికేగాని, వాపుని పూర్తిగా తగ్గించటానికి ప్రస్తుతం మందులులేవు.

**వి. – గూడూరు**

"నా బుగ్గలు లోపలికి వుంటాయి. కారణం ఏమిటంటారు."

బుగ్గలు లోతుకుపోయి ఉండటం ముఖము బుగ్గలలో ఉన్న కండరాలు క్రొవ్వు మొదలయిన, వాటిలోపంవల్ల, అని మాత్రమే ! అని సులభంగా అర్థం చేసుకోవచ్చు.

ఎక్కువగా విచారం ఆందోళన ఉన్నా, ఆహారం తీసుకోవటం తగ్గినా, కొన్ని మానసిక రోగాలతో బాధపడుతున్నాకూడా ఇలా కావటానికి ఆవకాశం ఉన్నది.

దీని నివారణ కొరకై పై విషయాలకు తగిన శ్రద్ధ చూపించవలసి ఉంటుందిగాని, ప్రత్యేక చికిత్స అంటూ ఏమీ లేదు.

---

# వారఫలం

**10–10–1975 శుక్రవారం మొదలు**
**16–10–1975 గురువారం వరకు**

**మేషం—:** అనుకూలమైన వార్తలను వింటారు. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి.వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. స్త్రీలకు— విలాస వస్తువులు కొంటారు. దైవకార్యాలు నెరవేరతాయి.

**వృషభం:—** ఫలితంలేని శ్రమ కలుగు తుంది. ఉద్యోగంలో కార్యభారం పెరుగు తుంది. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. విద్యావైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. నూతనవ్యవహారాలు లాభిస్తాయి. స్త్రీలకు —ఆరోగ్యంబాగుడదు. బంధు మిత్రులను కుల్సుకొంటారు.

**మిధునం:—** మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. వారం మధ్యలో చికాకులు యేర్పడతాయి. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు లాభాదాయకంగా ఉంటాయి. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. బంధువులకు చికాకులు యేర్పడతాయి.

**కర్కాటకం:—** వృత్తిలో సాటివారి పోటీ పెరుగుతుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి ప్రముఖులతో పరిచయాలు యేర్పడతాయి. మీ ఆలోచనలు ఫలిస్తాయి. వారం ఆఖరులో వ్యాపారంలో ప్రయాణకు గురి కాగలరు. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**సింహం :—** సాహసిక వ్యవహారాలు బాగుంటాయి మిత్రుల సహాయం లభిస్తుంది. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. సాటివారితో వాదప్రతివాదాలు తగవు. ప్రయత్నించిన పని సులువుగా నెరవేరు తుంది. స్త్రీలకు—కుటుంబ వ్యా

## వారఫలం

హారాలు బాగుంటాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**కన్య :—** స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగిస్తుంది. వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగు తుంది. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. పుణ్యకార్యాలు నెరవేరతాయి.

**తుల:—** అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. అనుకూలమైన వార్తలను వింటారు. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి. మీరు ఇది వరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి. స్త్రీలకు— వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**వృశ్చికం :—** మీ ఆలోచనలు ఫలిస్తాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగిస్తుంది. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**ధనుస్సు :—** వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. పైటివారిలో గౌరవం లభిస్తుంది. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. రావలసినడబ్బు అందు తుంది. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు— కుటుంబవ్యవహారాలు బాగుంటాయి. వినోదకాలక్షేపాల్లోపాల్గొంటారు.

**మకరం :—** ఉద్యోగంలో శ్రమ కలుగు తుంది. ...కా తాలూకు వస్తువులు పోవచ్చును. వారం మధ్యలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. వ్యాపారంలో ఆదాయం పెరుగు తుంది. ప్రయోజనంగల సంప్రదింపులను జరుప గలరు. స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు. బంధు మిత్రులను కల్సుకొంటారు.

**కుంభం :—** రావలసిన డబ్బు అందు తుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. వారం మధ్యలో వ్యతిరేకత యేర్పడు తుంది. మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు —కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగు తుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**మీనం— :** ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. వారం ఆఖరులో శ్రమపడినా, ప్రయోజనం ఉండదు. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. వ్యతిరేకమైన వార్తలను వింటారు.

—మహేష్



"ఆ పచ్చమేడ..." అర్జున్ జారబడి కూర్చున్నవాడు, నిటారుగా కూర్చుంటూ అన్నాడు.

కారాగింది. "ఆనందిని పార్టీకి వస్తున్నావా?" అంది

"ఊఁ ... నువ్వూ రా."

"ఆమె పార్టీలు బోరుకొడతాయి"

"నేను వుంటానుగా." వాగ్దానంలా అర్ధవంతంగా అన్నాడు.

తలూపింది. "వస్తాను" అని.

"ఓ. కే. థాంక్స్ ఫర్ ది లిఫ్ట్" అంటూ కారుతలుపు తెరిచాడు.

"నేనూ అదే అంటున్నాను. థాంక్స్ ఫర్ ది లిఫ్ట్." కళ్యాత్రి మృదువుగా అంది.

చిరునవ్వుతో "ఎనీ టైమ్." అన్నాడు భావగర్భితంగా.

"ఇంట్లో లైట్లు లేవేం? ఎవరెవ రుంటున్నారు?"

"నేను, మా అక్క. అక్క నిదలో వుండివుంటుంది ఈ టైములో"

# పోర్ట్రైట్

టి. లలిత



''మీ అక్కకి పార్టీలూ అవీ అలవాటులేదా ?''

''ఉహుం. మా అక్క దేవత...'' క్లుప్తంగా అన్నాడు అర్జున్.

''గుడ్‌నైట్'' అంది.

''స్వీట్ డ్రీమ్స్'' అంటూ దిగిపోయాడు. అతను గేటు తెరిచి లోపలికి వెళ్ళడం చూస్తూ, జ్ఞాపకాల తెరలని చించుకుంటూ ఆలోచిస్తోంది

ఈ రోడ్డంటే కదూ, తమ స్కూల్ బస్సు వచ్చేది ? బాల్యపు జ్ఞాపకాలని నెట్టివేస్తూ, అర్జున్ గురించి ఆలోచించింది

*   *   *

తను పన్చేసే అడ్వర్‌టైజ్‌మెంట్‌ల కంపెనీ వారి పార్టీలో పరిచయం అయింది, తమకి. మామూలుగా మొదలయిన స్నేహం, త్వరలోనే తాము తిరిగే ''హైసొసైటీ'' లో తాము ఇద్దరూ విడదీయరాని జంటగా పరిగణింపబడేదాకా వచ్చింది.

హిప్పీ పార్టీలూ, దొంగ త్రాగుడులు...లూజ్ మోరల్సు ... తనకి కొత్తయినా, అంత మోజు కాకపోయినా — అర్జున్‌కోసం అలవాటు చేసుకుంది.

ఒకనాటి రాత్రి — పొగనిండిన గదీ, తియ్యని హాషిష్ వాసనా. .నాగరికుల వ్యంగ్య సంభాషణలూ. . భరించలేక తోటలోని చల్లగాలికోసం వెళ్ళింది. అర్జున్ అనుసరించాడు. అనుకోకుండా అతని చేతుల్లో ఒరిగిపోయింది. చాలాసేపటి తర్వాత అంది — ''ఈ కిక్కే బాగున్నట్టుందే - వాటన్నిటి కంటేనూ...'' పార్టీకేసి తలతిప్పుతూ .

''ఇంకో లిఫ్ట్ కావాలా ?'' నవ్వుతూ మళ్ళీ తన నడుంచుట్టూ చేతులు బిగించాడు ... అప్పట్నుంచీ తమ కోడ్ వర్డ్ — లిఫ్ట్ అన్నది అర్జున్ లిఫ్ట్‌లు బాగుంటాయి ప్రతి లిఫ్ట్ ముందటిదాని కన్నా ఎత్తులకి—ఆకాశపు టంచులకి తీసికెళ్తుంది...

*   *   *

ఇదిగో యీ సందు దగ్గిరే రామ్మోహన్ దిగేవాడు రామ్మోహన్ గుర్తుకొచ్చాడు...లావుగా, ఎప్పుడూ కారే ముక్కుతో—వెక్కిరిస్తే ఆడపిల్లలా ఏడ్చేవాడు ఇక్కడ దింపి, బస్సు రివర్సు చేసుకునేవాడు జయరాం, తమ డ్రైవరు.

''పొ రైట్ పొ రైట్'' అని కండక్టరు—పేరు జానకిరాం కదూ, జానకిరాంతో బాటూ తామంతా అనేవారు జానకిరాం చేతిలో వుండే ఈలకోసం — పోటీలుపడేవారు. రోజుకొకర్ని ఊద నిచ్చేవాడు

'పొ రైట్' రాధ. తమకి ఈ సందులోనే పరిచయమయింది . మెల్లిగా పోనిస్తున్న కారుని ఆపి, జ్ఞాపకాల అయస్కాంతానికి లొంగిపోయింది.

ఒకరోజు, బస్సు రివర్సు చేసుకుంటుంటే, తమ 'పొ రైట్' 'పొ రైట్' లతో బాటు, వైదిశ్వరన్ చేతిలోని ఈలతోపాటు, యింకో తియ్యని కంఠం ''పొ రైట్'' అంది.

లేడీస్ సైకిలుమీద కూర్చుని, ఓ కాలు పేవ్‌మెంటుమీద ఆన్చి బాలన్సు నిలుపుకుంటోంది. నవ్వుతూ ''పొ రైట — పొ రైట్'' అనరిచింది తమతోబాటూ.

ఉత్సాహంగా ''పొ రైట్'' అన్నారు తామంతా. చేతులూపారు. బస్సు కనుమరుగయ్యే దాకా తనూ చేతులూపింది.

మర్నాడూ సైకిలుమీద కన్పించింది. చూడగానే — ''అదో, పొరైట్ !'' అన్నాడు వైదీ. గిరిజ ''పొ రైట్'' అనరిచింది కీచుగా. తానూ అరిచింది. కిటికీల్లోంచి తలలు బయటకిపెట్టి తాము అరిచిన అరుపులకి తిరిగి చూసింది. ''పొ రైట్.'' జవాబిచ్చింది నవ్వుతూ.

చాలారోజుల వరకూ, బస్ రివర్సు చేసుకుంటుంటేనో, ఆ రోడ్డుమీద తనతోబాటు వస్తూనో ''పొ రైట్'' అనేది. ఆమె పేరే ''పొ రైట్'' అయిపోయింది.

ఒకరోజు వైదీ ''పొ రైట్'' కన్పించగానే — బస్సు ఆపించేసాడు. ''పొరైట్ — మాతో రండి... మేం దిగబెడతాం...'' అన్నాడు కిటికీలోంచి.

''ఈ సైకిలో ?'' నవ్వుతూ అంది.

''నేను తెచ్చి పెడతానమ్మా యిగారూ...'' జానకిరాం అన్నాడు.

బస్సెక్కింది పొరైట్. కండక్టరు సీట్లో కూర్చుంది.

''పొరైట్ ... మీ పేరేమిటి ?''

''రాధ.''

''పొరైట్ — మీరూ చదువుకుంటున్నారా ?'' అందరూ ఆమెతో మాట్లాడాలనే—దగ్గిర కూర్చోవాలనే తనో పక్కా, వైదీ ఓ పక్కా కూర్చున్నారు పొరైట్‌కి. తనెప్పుడూ జానకిరాం పక్కన కూర్చునేది. జానకిరాం సీట్లో పొరైట్ !

''నేను ఫిలాసఫీ చదువుకుంటున్నాను...'' పొరైట్ చెప్పింది.

''ఫిలాసఫీ అంటే వేస్ట్ అని అర్థంటగా... మా సైన్సు మాష్టారు చెప్పారు'' అంది తను.

పొరైట్ తనవైపు తిరిగి ''కాదు బేబీ ... ఏ సబ్జక్టూ వేస్ట్‌కాదు. దేని వుపయోగం దానికి వుంటుంది'' అంది.

''అయితే, ఫిలాసఫీ వుపయోగం ఏమిటి ?'' తను అడిగింది. కుసుమా టీచర్‌లా మాట్లాడు తోంది పొరైట్ కూడా.

''ఫిలాసఫీ ... మనం ఎలాంటి జీవితం గడుపుతామో, ఎలాంటి జీవితం గడపాలో ... మనం ఎందుకు ఏ పనైనా చేస్తామో తెలుస్తుంది ఫిలాసఫీ చదివితే మనం చేసే పని తప్పయితే అది తప్పు అని మనకి తెలియచేస్తుంది. మనలని మనకి తెలియ చేస్తుంది. నువ్వు పెద్దదానివయాక అర్థమవుతుందిలే.'' అంది పొరైట్ నవ్వుతో.

''ఇప్పుడూ అర్థమయింది మనం ఏ పనయినా చేసేటప్పుడు, అది మంచిదా, కాదా ? చెయ్యచ్చునా చెయ్యకూడదా అని చెప్పేది ఫిలాసఫీ. కదూ ?''

తలూపింది పొరైట్... వైదీ ఆత్రపడిపోతూ అడుగుతున్నాడు. ''పొరైట్ మీకు టార్జాన్ ఇష్టమా, ఫాంటమ్ ఇష్టమా ?'' అని. ఏదో జవాబు చెప్పింది.

పొరైట్ యింట్లోని సపోటా చెట్టుని చూసి నోరూరించుకున్నారు, తామంతా. ''రండి, పళ్ళు కోసుకోండి'' అంది. జయరాం వద్దంటుంటే విన్పించుకోకుండా. బిలబిలా దిగిపోయారు తాము. సపోటా పళ్ళిచ్చి, మంచినీళ్ళిచ్చింది.

తను బస్సెక్కుతుంటే ''బేబీ, ఎప్పుడూ నువ్వు చేసే పని మంచిదా కాదా అని ప్రశ్నించుకోడం




మరిచిపోకూ.'' అంది నవ్వుతూ.

తన బుగ్గ ముద్దెట్టుకుంది కూడా... బస్‌లో పిల్లలంతా తనకేసి ఈర్ష్యగా,అసూయగా చూసారు. గర్వంగా నవ్వింది తను.

ఆ మర్నాడు గిరిజ తనతో మాట్లాడటం ఆపేసింది. సైన్సు మాష్టారు, ''సార్, మీరు చెప్పింది తప్పు, ఫిలాసఫీ అంటే వేస్ట్ కాదు, మా పొరైట్ చెప్పింది'' అంటే, కోపం తెచ్చుకుని, ఆ పిరియడంతా నించోబెట్టారు. ఆ తర్వాత హెచ్. ఎమ్. పిల్చి, ''అధిక ప్రసంగం చేస్తున్నావుట క్లాసుల్లో'' అని మందలించారు.

ఆ ఏడు పరీక్షల తర్వాత పొరైట్‌ని చూడలేదు. సెలవల తర్వాత, రామ్మోహన్ స్కూలు మారిపోయాడు. అభిరామపురం వెళ్లడం మానేసింది బస్సు.

*   *   *

చీకటిలో, సందులు సరిగ్గా తెలియడంలేదు. చాలా ఏళ్ళు గడిచిపోయిన గుర్తుగా ఎన్నో మార్పులు.

తను స్కూలు బస్ రూట్ గుర్తు చేసుకుంటూ కారుని తోలింది... ఆఁ... ఈ సందులోనే దిగేవాడు రామ్మోహన్. ఇపుడేం చేస్తున్నాడో... యింకా లావుగానే వున్నాడా ?

ఈ రోడ్డు... ఊఁ... పొరైట్ యిల్లు సందు ఇదే .. కారుని మెల్లిగా పోనిస్తూ, ఇళ్ళు వెతికింది... అదిగో — సపోటా చెట్టున్న ఇల్లు. పొరైట్ యిల్లు... ఇప్పుడేం చేస్తోంది పొరైట్ ?

హఠాత్తుగా వులిక్కిపడింది. చుట్టూ తిరిగి—అర్జున్ని దింపిన సందుకే వచ్చింది తను ! అరె — అర్జున్ ఈ ఇంట్లోకే వెళ్లాడు ! అర్జున్... పొరైట్... పొరైట్ ,రాధ తమ్ముడా ? పొరైట్ వాళ్ళు ఇల్లు మారారేమో.. ఉహుం . అర్జున్ మాటల్లో ఒకసారి అన్నాడు... ''పుట్టి పెరిగిన ఇల్లు — వదిలిపోవడం నరకంలాగా వుంటుంది... మా కంపెనీవాళ్ళు క్వార్టర్సు ఆఫర్ చేస్తే... అందుకే వద్దని — మా యింట్లోనే వుండిపోయాను.. '' అని.

కారు ఇంజన్ రన్నవుతున్న శబ్దం — ప్రశాంతంగా — నిశ్శబ్దంగా వున్న ఆ రోడ్డుని కలచి

## ఆకాంక్ష

నా జాతి ఎదలో
స్పందన కలగాలని,
కరకు రాతిగుండె కూడా
వెన్నలా కరిగిపోవాలని,
నిన్నూ, నన్నూ వేరు చేసిన
అంతస్తుల అడ్డుగోడలన్నీ
నిలువునా కూలిపోవాలని,
బ్రతుకు బాటలో కాలం
వెలుగు జల్లుల్ని కురిపించాలని,
మస్తిష్కంలో మానవతాబీజం
మహావృక్షమై నిలవాలని,
మనోసీమలో మమతానురాగాలు
మల్లెపూవుల్లా గుబాళించాలని
ఎన్నెన్నో ఆశలతో
భవిష్యత్తుకోసం
బంగారు కలలు కంటున్నాను.

— శ్రీమతి కె. సీత

## పో – రైట్

వేస్తోంది. నిట్టూర్చి, కారుని ముందుకి నడిపింది.

తను చేసే పని మంచిదా కాదా అని ప్రశ్నించు కోడం మరిచిపోవద్దంది పోరైట్.

ఇపుడు . ఆనందిని పార్టీ, తన హైసోసైటీ జీవితం, నాగరికతా లక్షణాలుగా అలవరుచుకున్న సిగరెట్లు, తాగుడు, రీఫర్స్. తన అభ్యుదయం చూపించుకుందుకు మార్చిన బాయ్‌ఫ్రెండ్స్... ఫాషన్స్ అని వేసుకునే వేషాలు... ఉద్యోగంలో ప్రమోషన్ కోసం, బాస్ మెప్పుకోసం పడే పాట్లు...

తను చేస్తున్న పన్లు మంచివా, కాదా అని ప్రశ్నించుకోవడం మరిచిపోయింది. ఏమీ తెలియని మంచి తప్పు మరొకటి వుంటుందని ఎరుగని బాల్యావస్థ, కౌమార దశలతో బాటే, ఆ మాటలనీ మరిచిపోయింది

తన జీవిత వాహనం రివర్సు చేసుకోవాలి... సాలోచనగా తను, ముగ్గురమ్మాయిలతో షేర్ చేస్తున్న ఫ్లాట్ చేరింది. అదీ నాగరికతా లక్షణమే– స్వంత యిల్లు, తల్లి తండ్రి వుండగా – వేరే వుండటం. .

ఫోన్ రిసీవరెత్తి. . నంబరు తిప్పింది... మూడుసార్లు రింగయ్యాక – ఎవరో తీసారు... "హల్లో" తియ్యని కంఠం. పోరైట్‌దే.

ఏమనాలో తెలియలేదు. మాటల కోసం వెతుక్కుంటోంది – మౌనంగా.

"హల్లో..." మళ్లీ .. పోరైట్ "ఎవరోనట్‌రా అర్జున్... పలకడంలేదు ." అంటోంది పక్కగా.

ఫోను పెట్టేసింది. ఇన్‌లాండ్ కవరొకటి తీసి – పెన్ను వెతుక్కుని – రాసింది "అర్జున్ – ఆనందిని పార్టీకిరాను. నాకు లిఫ్టివ్వద్దు ఇంక."అని.

ఎడ్రెస్ రాస్తూ – పోరైట్ పోరైట్ అనుకుంది. తన స్కూలు జీవితపు ఉత్సాహంతో.

***అంకితం*** : మా స్కూలు బస్ పోరైట్ రాధకి – బోలెడంత ప్రేమతో – జ్ఞాపకాలతో.

# వేశ్యల బ్రతుకు * * * * * * * * పూలసెజ్జ కాదు

ప్రపంచంలో అతి పురాతనమైన వృత్తి వ్యభిచారం. ప్రస్తుత సమాజంలో సెక్స్ విషయాలతో కొంత స్వేచ్ఛ, సడలింపులు ఉన్నా వ్యభిచారం పెరుగుతూనే ఉంది. లెక్కలలో కనిపించే వ్యభిచారిణుల కన్న కొన్ని వృత్తులలో ఉండే అమ్మాయిలలో వ్యభిచారం ఎక్కువైంది

డాక్టర్ డొరోతియా రిట్టర్ రోర్ అనే ఆమె ఫ్రాంక్‌ఫర్ట్ వ్యభిచారిణులపై ఒక సర్వే జరిపారు. స్వేచ్ఛా జీవితాన్నాశించి ఎందరో అమ్మాయిలీ వృత్తికి దిగుతున్నారన్నా రామె. నూటికి 82 మంది అమ్మాయిలు సుఖాన్నాసించి ఈ వృత్తిలోకి దిగటం లేదట – వారిలో సగంమంది బలవంతంగా ఈ "రొంపి" లోకి లాగబడ్డవారే. మిగతా సగం మందిలో కూడా ఈ వృత్తిపట్ల అసహ్యత, నిస్పృహ నెలకొని ఉంది

డాక్టర్ రిట్టర్ రోర్ మరో విషయాన్నికూడా తెలియజేశారు. ఆ దేశంలోని విద్యావతుల శాతంకన్నా వ్యభిచారిణులలో విద్యావతుల శాతం ఎక్కువ ఉందట. ప్రాథమిక విద్య నేర్చినవారు దేశంలోని యువతులలో 75 శాతం ఉంటే – వ్యభిచారిణులలో 82 శాతం ఉన్నారట. సెకండరీ స్థాయి విద్య నేర్చుకున్నవారు దేశంలో 8 శాతం, వ్యభిచారిణులలో 13 శాతం ఉన్నారట. ఒక్క స్కూల్ ఫైనల్ స్థాయిలో మాత్రం వ్యభిచారిణులలో 3 శాతం దేశంలోని యువతులలో 17 శాతం ఉందట.

వృత్తి విద్యలలో శిక్షణ పొందినవారిలో కూడా వ్యభిచారిణులదే పై చేయిగా ఉన్నారట.

సర్వే అంచనాల ప్రకారం వ్యభిచారంలోకి దిగిన అమ్మాయిలలో 49 శాతం క్రింది తరగతుల నుంచి, 45 శాతం మధ్య తరగతి నుంచి, 35 శాతం గౌరవనీయమైన కుటుంబాల నుంచి వచ్చినవారట. అందులో 27 శాతం అమ్మాయిలు తల్లిదండ్రులలో ఏ వొక్కరి దగ్గరో పెరిగినవారు, 13 శాతం తాత, నాయనమ్మ, అమ్మమ్మల దగ్గర పెరిగినవారో లేక శరణాలయాలనించి వచ్చినవారో అయి ఉన్నారట 25 శాతం అమ్మాయిలు అనాథ శరణాలయాలనించి వచ్చినవారుగా ఉన్నారట.

తాము వ్యభిచారిణుల దగ్గర తీసుకున్న డబ్బుతో జీవిస్తున్నా కూడా వారిని తార్చేవారు వారిపట్ల క్రూరంగా, అమానుషంగా ప్రవర్తిస్తారన్నది అన్ని సందర్భాలలోనూ జరగదని, వ్యభిచారిణులు తమ వృత్తిని చేసుకోడానికి అనువైన స్థలం యిచ్చినందుకు వారిదగ్గర ఈతార్చేవారు డబ్బుతీసుకుంటారని డాక్టర్ రిట్టర్‌రోర్ సర్వే తెలుపుతున్నది.

వ్యభిచారిణుల జీవన వ్యయం చాలా ఎక్కువగా ఉంటుంది. సాధారణంగా ఈ వృత్తిలోకి దిగిన అమ్మాయిలు తగినంత డబ్బు సంపాదించి దానినుంచి తప్పుకుందామని కలలు కంటారు. కానీ అలా జరగటం చాలా అరుదైన విషయం. చివరికి వారిలో చాలామంది సమాజంలో ఏకాకులుగా, ఎవరికీ పనికిరానివారుగా మిగిలిపోతారు క్లోక్ రూమ్‌లలో సామాన్లు అందించో, మరుగుదొడ్లలో నీళ్లు పట్టడంలాంటి పనులు చేస్తూనో వచ్చే చిల్లరడబ్బులతో పొట్ట పోసుకుంటూ శేష జీవితం గడుపుతూ ఉంటారు.

పై వారమే
కొత్త సీరియల్
"శ్రావణ సంధ్య"
ప్రారంభం!

## గ్రహాలపై ఉపయోగించే వాహనాలు

అంగారకుడు వంటి గ్రహంపై ఉండే అతి క్లిష్టమైన ప్రదేశాలను పరిశీలించటానికి అమెరికా వ్యోమ సంస్థ (నాసా) నిర్మించిన ఒక వాహనం భూమిమీద కూడా ఉపయోగపడుతుందట. తైల, ఖనిజ పరిశోధనలకూ, రోడ్లు, ప్రయాణ సౌకర్యాలు లేనిచోట్ల అత్యవసర పరిస్థితులలో ఉపయోగించటానికి ఈ వాహనం పనికివస్తుందట. మూడు రకాలుగా ఈ వాహనం నడుస్తుంది. ప్రక్కలకు తిరిగే చక్రాలపై నడుస్తుంది. టైర్ల చక్రాలతో నడుస్తుంది. ప్రతి చక్రానికీ త్రికోణాకారంలో కాళ్లు ఉంటాయి ప్రతి కాలూ దేనికదే పని చేయగలదు. దేని ఇంజను దానికే ఉంటుంది. ఈ కాళ్లు అవసరమైతే పాదాలలాగా ఉపయోగపడతాయి. చక్రాలు తిరిగినప్పుడు రవంత కుదుపు వస్తుందట. అయితే, లోతైన బురదలో కూడా ఇది సునాయాసంగా పయనించగల దంటున్నారు కొండ ప్రాంతాలలోనూ, వరదలు వచ్చినచోట ఈ వాహనం బాగా ఉపయోగపడుతుందని 'నాసా' పరిశోధకులు అంటున్నారు.

# రాజేష్ ఖన్నా

ప్రతి రోజూ కొత్త ఆకర్షణ కొత్త రూపం
పేరు ప్రఖ్యాతుల సరికొత్త శిఖరం



వారం వారం కొత్త తీరులు, తెన్నులు, కొత్త తరహాలలో—బొంబే డయింగ్ వారి దర్జా అయిన బట్టలలో తయారు చేసినవి. సింథెటిక్ షర్టింగుల హుందా అయిన శ్రేణిలో—50/50, 67/33, 80/20, యింకా 100% పోలియస్టర్ ప్రింటులు, పోలియస్టర్ డెనిమ్స్, యింకా టెక్స్చరైజ్డ్ సూటింగులు.

**కాపిటాన్** పోలియస్టర్ షర్టింగు
**వాడ్రీన్** పోలియస్టర్ సూటింగు



బట్టలలో ఎక్కువ మిక్కిలి అందాలు—
ప్రతి రోజూ సరికొత్త డిజైన్ల రూపాలు

# బొంబే డయింగ్



BDM-27A tel

సీరియల్

# జాబిమేడ

— పోలాప్రగడ రాజ్యలక్ష్మి —

*(గత సంచిక తరువాయి)*

వ్యంగ్యపూరితంగా వున్న ఉష వుత్తరాన్ని చదవడం పూర్తిచేసేసరికి ప్రభాకరం మనసంతా అదోలా అయిపోయింది. ఆత్మీయతా, ఆప్యాయుతా ఏం లేదు ఆ వుత్తరంలో ఉష ఎప్పుడూ యిలా రాయలేదు ఇలా రాసిందేవిటి ? ఆమెలో ఏమైనా మార్పు వచ్చిందా ? ఆ మాధవ్ ఎవరు ? అంత పొగుడుతూ రాసింది ! ... కొత్తగా స్నేహం అయిన వ్యక్తేమో .. అంత సన్నిహితం అయ్యాడా ?

సీతాలు వచ్చి "మీకోసం విశాఖపట్నం నుంచి ఎవరో అయ్యగారు వచ్చార"ని చెప్పాడు.

గురుమూర్తిగారేమిటి చెప్మా అనుకొని, "ఎలావుంటారు ? ముసలాయనా ?" అని అడిగాడు ప్రభాకరం

"అబ్బే . . పడుచాయనేనండీ ! మీకంటే కూడా నాలుగైదేళ్ళు చిన్నవుంటాడు."

"సరే, యిక్కడికి తీసుకురా."

సీతాలు మెట్లు దిగుతూంటే కాఫీ పట్టుకుని రావుడు మెట్లు ఎక్కుతోంది. సుతారంగా ఆమె బుగ్గమీద చిటికేసి "అయ్యగారికి కాఫీ పట్టికెళుతున్నావేటే !" అంటూ పలకరించాడు సీతాలు.

"ఏటే, గీటే, అంటూ ఏటా పిలవడం?"

"అదేటి ? పెళ్ళాడి తాళి కట్టిన పెళ్ళాన్ని ఏమొగుడేనా "ఏటే" అని పిలవకుండా మరెలా పిలుస్తాడేటి ?"

"రావుడూ ! అని ముద్దుగా పిలవలేవూ" మూతి మూడు వంకర్లు తిప్పింది రావుడు.

"పేరెట్టి పిలవడమా ! సిగ్గేస్తదే !"

"మొగాడికి నీకు సిగ్గేవిటి ? అది పేసను. ఇంకీకాడనుంచి అలాగే పిలు. ఏంటి? తెలిసిందా?"

"అలాగే ! అలాగే పిలుస్తా. మరైతే ఓ ముద్దిచ్చిపో. ." అంటూ, ఆమె అంగీకారంకోసం ఆగకుండానే బుగ్గమీద ముద్దెట్టుకొని వెళ్ళిపోయాడు సీతాలు.

రావుడు నవ్వుకుని "మనువయి రెండేళ్ళయినా ఈడికీ పోకిరీ బుద్దులూ పోకిరీ యాసాలూ పోలేదు" అనుకుంటూ పైటతో బుగ్గ తుడుచుకొని కాఫీ పట్టుకొని పైకి వెళ్ళింది.

"నమస్కారం అండీ" అంటూ గదిలోకి అడుగుపెట్టిన మాధవ్‌ని చూసి ఒక్క క్షణం విస్తుబోయాడు ప్రభాకరం.

ముఖంలో కుర్రదనంతో కూడిన చురుకుదనం, గడుసుదనంతో కలిసిన మంచితనం కొట్టవచ్చినట్లు ప్రస్ఫుటంగా కన్పిస్తున్నాయి మగాళ్ళకే ఆకర్షణ కలిగించే ఆ మనిషి రూపంలాగే మేనర్స్ కూడా ఎదుటివారిని మంత్రముగ్ధుల్ని చేసేలాగ ఉన్నాయి.

"మీరు మాధవ్ కదూ?" అన్నాడు ప్రభాకర్.

"అరే . నా పేరు మీకెలా తెలిసింది ?" అంటూ ఆశ్చర్యపోయాడు మాధవ్.

"కూర్చోండి ఉష రాసిన ఉత్తరం ఇప్పుడే చదువుతున్నా .. అందులో మీ గురించి పొగుడుతూ రాసింది విశాఖపట్నం నుంచి వచ్చారనడానికి తోడు, మిమ్మల్ని చూడగానే మీరే అనుకున్నా... ఊ... ఏవిటి విశేషాలు ?.. ఉష బాగా పరీక్షలు రాస్తోందా . రావుడూ ఆయనకో కాఫీ పట్రా" అంటూ ఎన్నాళ్ళనుంచో పరిచయం ఉన్నట్లు ఎంతో కలుపుగోరుతనంగా మాట్లాడాడు ప్రభాకరం... "ఎంత మంచివాడు ప్రభాకరం !... ఉష చెప్తూంటే ఇంకా ఏవిటో అనుకున్నాను." అనుకున్నాడు మాధవ్. ప్రభాకరం ముఖంలో ఒక రకమైన నీరసం, నిరాశా, అలసటా కన్పించి, "ఇతణ్ణి చూస్తే జాలేస్తోంది.. ఈ స్థితిలో ఇతనికి ఏ ఉషలాంటి స్త్రీయో, దగ్గరుండి ఆలనా పాలనా చూస్తూ సంరక్షణ చేయవలసిన అవసరం కనిపిస్తోంది... ఉషని ఇతన్నుంచి వేరు చేసి నేను పెళ్లి చేసుకుని తీసుకుపోవడం ద్వారా ఇతనికి అన్యాయం చేస్తున్నానా" అని ఒక్క క్షణం ఆలోచించాడు మాధవ్.

కానీ, అంతలో అక్కడికి మెరుపుతీగలా జానీ వచ్చి ప్రభాకరం కూచున్న కుర్చీ దగ్గర టేబిల్ మీద చేతులాన్చి, ముందుకు వంగి, చనువుగా మాట్లాడుతూ, మధ్య మధ్య నవ్వుతూ ప్రభాకరాన్ని నవ్విస్తూ ఏదో కేసు సంగతి ముచ్చటించి వెళ్లిపోవడం, ఆమెతో మాట్లాడుతున్నంతసేపూ, ప్రభాకరం గాజు కళ్ళు, దీపాల్లా మెరిసి, ముఖంలో ఒక రకమైన రిలీఫ్ కనిపించడం — ఇదంతా గమనించిన మాధవ్‌కి "ఫర్వాలేదు ఉషని తను తీసుకువెళ్లిపోయినా ప్రభాకరానికి ఈమె అండ ఉంటుంది... ఇతనిలో మళ్లీ చైతన్య జ్యోతిని ఈమె వెలిగించగలదు . అప్పుడు ఇతనికి తనేమీ అన్యాయం చేసినట్టు అవదు" అని మనస్సుకి సరిపెట్టుకున్నాడు మాధవ్

కాఫీ తాగి కబుర్లు చెప్తున్నంతసేపూ, ప్రభాకరంతో కలిసి అతనితో భోజనం చేస్తూన్నంతసేపూ, 'అసలు సంగతి ఇతని దగ్గర ఎలా కదపడమా' అని ఆలోచిస్తున్నాడు మాధవ్ ప్రభాకరం కూడా 'ఇతను ఎందుకొచ్చాడా ?. . ఏవేవో మాట్లాడతాడు కాని తను ఎందుకొచ్చాడో చెప్పడే' అని అనుకోసాగాడు. సాయంత్రం దాకా తన కాలేజీ కబుర్లూ, చిన్నప్పటి ఆకతాయి పనులూ, లెక్చెరర్ల తమాషాలూ, విదేశాల్లో వింతలూ అక్కడి ప్రజల చిత్ర విచిత్రమైన అలవాట్లూ చెబుతూ, ప్రభాకరాన్ని నవ్విస్తూ, అతని మనస్సుకి ఉల్లాసాన్ని కల్పిస్తూ తన చమత్కారమైన సంభాషణతో అతని ముఖంమీద నవ్వుల వెన్నెలలు పండిస్తున్నాడు మాధవ్.

"ఇతను ఎంత తెలివైనవాడు ! ... ఏం చురుకు ! ఏం మంచితనం ! యిలాంటి తమ్ముడు ఒకడు తనకు వుంటేనా ?" అంటూ మురిసిపోసాగాడు ప్రభాకరం

"సాయంత్రం అలా మా గుడికి వెళ్ళివద్దాం రండి కొత్తగా అక్కడ కళ్యాణమంటపం కూడా కట్టించాను" అంటూ ప్రభాకరం మాధవ్‌ని గుడికి తీసుకెళ్ళి, అదంతా చూపించాడు వెనకాల చేతులు కట్టుకుని తిరుగుతూన్న ఆచార్లుని చూసి "ఆచార్లుగారూ ! స్వామికి అష్టోత్తరం ఒకటి 'చేయించండి వీరి పేర చేయించండి మాధవ్, మీ పేరూ గోత్రం అన్నీ ఆయనకి చెప్పండి" అన్నాడు ప్రభాకరం.

"నాకిలాంటి పూజల్లో నమ్మకాల్లేవండి" అన్నాడు మొహమాటంగా మాధవ్

"హమ్మమ్మ, అలా అనకండి. మా వేణు

**జరిగిన కథ 13 :** భద్రయ్యగారి పిల్లలు మురళి, ఉషలు. భద్రయ్యగారి ఆస్తంతా దానధర్మాలతో హరించిపోయింది భద్రయ్యగారి కుటుంబాన్ని కనిపెట్టి వుండమని కొడుకు ప్రభాకరానికి చెప్తాయ జోగమ్మగారు ఉషని చెరచ ప్రయత్నిస్తాడు అంకరాజు. భద్రయ్యగారు మరణిస్తారు. ఢిల్లీ చిత్ర కళా ప్రదర్శనలో బహుమతి సంపాదిస్తాడు మురళి ఉషని మద్రాసులోని ఆంధ్ర మహిళా సభలో చేర్పిస్తాడు ప్రభాకరం. దొడ్డమ్మ జోగమ్మగార్ని చూడాలని వస్తుంది లీల మురళితో కలసి విహార యాత్రలకి బయల్దేరుతుంది లీల పెళ్లనే తంతు లేకుండానే దంపతు లౌతారు లీల మురళిలు మెడిసిన్ పూర్తయ్యాకే పెళ్లి అన్న ప్రభాకరం అంటే యేవగింపు కలుగుతుంది ఉషకి లీల మురళిలను చూడాలని వచ్చిన ఉష, ప్రభాకరాన్నీ కలుస్తుంది ప్రమాదవశాత్తు మేడమీదనుంచి పడిన జోగమ్మగారి వెన్నెముక దెబ్బతింటుంది. ప్రభాకరం సహాయాన్ని తిరస్కరిస్తుంది ఉష తల్లి కాబోతున్న లీల, తండ్రిని చూడటానికి బయల్దేరుతుంది ప్రొఫెసర్ గురుమూర్తిగారి బావమరది మాధవ్‌తో పరిచయ మవుతుంది ఉషకి ఉషా మాధవ్‌లు పరిచయం పెళ్లివరకూ వెళుతుంది

మాధవస్వామి చాలా మహిమ వున్నవాడు మన స్ఫూర్తిగా నమస్కారంచేస్తే మనస్సులోవున్న కోరికలు తీరుస్తాడు!"

"నిజంగా? అయితే చేయించండి నిజానికి యిప్పుడు నా మనస్సులో ఒక కోరికకూడా వుంది" అన్నాడు మాధవ్ అనీ, "దేవుడు పేరేమిటి చెప్పారూ? వేణుమాధవస్వామి కదూ? సరిగ్గా నాదీ అదే పేరేనే?" అన్నాడు

ప్రభాకరం నవ్వి "భలేవారే! మీ పేరు, దేవుడు పెట్టేసుకున్నాడంటారా, లేక దేముడి పేరే మీ పెద్దలు మీకు పెట్టారంటారా? మీరు ఒకప్పుడు యీ వూరివారే అన్నారుగా అందువల్ల మీ తల్లిదండ్రులు ఈ స్వామి పేరు మీకు పెట్టి వుంటారు" అన్నాడు

"అంతేలెండి లేకపోతే ఆయన, వాళ్ళబ్బాయి పోలిక అన్నట్టుంటుంది తండ్రి పోలిక కొడుక్కి వస్తుందికాని, కొడుకు పోలిక ఎక్కడేనా తండ్రికి వస్తుందా?"

"ఎగ్జాక్ట్లీ! రండి పూజ మొదలైనట్టుంది"

పూజ అయినంతసేపూ కళ్ళు మూసుకుని ఏకాగ్రతగా దేవుణ్ణి ధ్యానిస్తూ నిలబడి, హారతి కళ్ళకి అద్దుకున్న తర్వాత, మనస్సా భగవంతుడికి నమస్కారంచేసి బయిటికి వస్తూన్న ప్రభాకరాన్ని చూసి "ఇటువంటి పవిత్రమూర్తి దగ్గర్నుంచా, తను ఉషని తీసికెళ్ళిపోతున్నది!" అని ఒక్క నిముషం బాధపడ్డాడు మాధవ్ కాని వెంటనే అందాలూ సుగుణాలూ కలబోసిన అపురూప లావణ్యరాశి అయిన ఉష జ్ఞాపకం వచ్చేసరికి, అతనిలో వున్న స్వార్థం చెయ్యిజాపి ఏదో అనబోయిన ఆత్మ నోరు మూసింది

కళ్యాణమంటపం మీద ఇద్దరూ కూర్చున్నారు

చల్లని గాలి మెల్లగా వీస్తోంది

వీచిన గాలికి పులకించి, బొగడపువ్వులు, అక్కడక్కడ ముత్యాల జల్లులా కురుస్తున్నాయి పక్కనున్న బొగడ చెట్టు కొమ్మల్లోంచి జల్లెడ పట్టినట్లు వెన్నెల చిదపలు, మండపం మీద కూర్చున్న మాధవ్ ప్రభాకరాల మీద మంచు పువ్వుల్లా పడుతున్నాయి

చల్లని వెన్నెల – తియ్యని బొగడ పువ్వుల పరిమళం – పైన కొమ్మల్లో నిద్దట్లో ఒత్తిగిలుతున్న పక్షుల చిన్న చిన్న చప్పుళ్ళు

సమయం ఎంతో మనోహరంగా, గంభీరంగా ఉంది

"మీతో కొన్ని విషయాలు మాట్లాడాలి" నెమ్మదిగా, గొంతు విడీవిడకుండా అన్నాడు మాధవ్

ప్రభాకరం అతని కళ్ళల్లోకి చూశాడు

సంభాషణ ఎలా ప్రారంభించాలా అని కాస్సేపు తటపటాయించేడు మాధవ్ "ఏదో సందేహిస్తున్నట్లున్నారు ఎందుకు సందేహం? చెప్పండి" ప్రభాకర్ హెచ్చరించాడు

"మీరు మీరు ఉషని పెళ్లి చేసుకోరని తెలిసింది"

ప్రభాకర్ ఉలిక్కిపడి "ఎవరన్నారు?" అని అరిచాడు గట్టిగా

మాధవ్ మాట్లాడలేదు

ప్రభాకరం కొంచెం శాంతించి "ఎవరన్నారు మీతో ఉష అందా?"

"లేకపోతే నాకు ఎలా తెలుస్తుంది?"

"ఊఁ"

"మీరీ ప్రశ్నకి సమాధానం చెప్తే, మిగిలిన సంగతులు మాట్లాడతాను"

"ఆ సందేహం ఎందుకు వచ్చింది అసలు?"

"నేను చదవను పెళ్లి చేసుకుంటాను అంటూంటే మీరు బలవంతంగా చదవాల్సిందే అన్నారటగా?"

"అవుమా తెలివీ, అందం, మంచితనం, అన్నీ ఉన్న ఉషకి చదువొక్కటే లోటు అనిపించింది పైగా ప్రతి క్లాసులోనూ ఫస్ట్‌గా వస్తూ మెడిసన్ సీటు సంపాదించిన వ్యక్తిని, నా స్వార్థం కోసం పెళ్లి చేసుకుని, ఆమె భవిష్యత్తుని పాడు చెయ్యడం ఏం భావ్యం"

"ఆ భవిష్యత్తు నాకు వద్దు మొర్రో అని ఆమె అందికదా?"

"ఆమెకేం తెలుసు చిన్నపిల్ల – తన బాగేదో తనకి తెలియదు పెద్దవాడినీ, ఆమె శ్రేయోభిలాషినీ నేను ఆమె కేది మంచిదో చూడాలి కాని, ఉద్రేకంలో ఏదో అంది అని అలా చేస్తే ఎలా"

(28 వ పేజీ చూడండి)



## తక్కువ చిత్రాలలో నటించడానికి కారణం ?

అడిగిన ప్రతి నిర్మాతకు పని చెయ్యడానికి అభ్యంతరం లేదని చెప్పే మనస్తత్వం గొన్న కృష్ణంరాజు తక్కువ చిత్రాలలో నటించడానికి ఏం కారణం ప్రేక్షకులకు తెలియాలిగా.

ఒకే రకం పాత్రలు పోషించడం యిష్టమైన అభిమానులకు అయిష్టాన్ని కలిగించగలదన్న ఆయన వాదంలో న్యాయం వుంది.

పగ, ప్రతీకారం తీర్చుకొనే కథానాయకుడుగా నటించాలన్న ప్రేక్షకుల కోర్కెను తిరస్కరించడం ఆయనకు అయ్యే పనికాదు.

కృషితో తనకంటూ ఒక స్థితిని, పరిస్థితిని ఆర్జించిన కృష్ణంరాజు, ప్రజలను ప్రీతిపరిచే పాత్రలనే పోషించాలన్న నిర్ణయాన్ని తీసుకున్నారు.

ధనార్జన మాత్రమే తన ధ్యేయం అయ్యుంటె, మంచి చిత్రాలను వలదనేవారా ?

## భక్త కన్నప్ప !

గోపీకృష్ణా మూవీస్ నిర్మిస్తున్న వర్ణ చిత్రం "భక్త కన్నప్ప" కృష్ణంరాజుకు కొత్త మలుపును తేగలదు.

అర్జునుడుగా, తిన్నడుగా, కన్నప్పగా (మూడు రకాల పాత్రలు) వైవిధ్యం వున్న ఆ హార్యంలో, భిన్నత్వం వున్న వేషంలో కృష్ణంరాజు నటించడం ముదావహం.

"భక్త కన్నప్ప" వర్ణ చిత్రం షూటింగు నవంబరు అయిదునుంచి ఏకధాటిగా పక్షంరోజులు జరుగుతుందని, నిర్మాత సూర్యనారాయణరాజు చెప్పారు.

"కన్నప్ప" చిత్రానికి విక్టరీ, బాపు, వి. ఎస్. ఆర్. స్వామి, వాలి, సత్తిరాజు, సత్యానంద్ ముఖ్య సాంకేతిక సారథులు.

"అగ్రనటి" ముఖ్య స్త్రీ పాత్రను పోషించ, ప్రభాకరరెడ్డి, రావుగోపాలరావు, రాజబాబు, జయమాలిని మరియు సత్యనారాయణ కథలోని కీలక పాత్రలను ధరిస్తున్నారు.

విఖ్యాత సంగీత దర్శకులు ఆదినారాయణరావు, సత్యం కలిసి "కన్నప్ప" చిత్రానికి సంగీతాన్ని సమకూర్చడం విశేషాంశం. ఇద్దరు సంగీత దర్శకులు యిలా చెయ్యడం తెలుగులో యిదే ప్రథమం.

"భక్త కన్నప్ప" చిత్రం ఏ తరంవారినైనా ఆకర్షించగల కథాంశం గొనియుండడంవల్ల, కృష్ణంరాజుకు కన్నప్ప పాత్ర పట్ల ప్రత్యేకమైన మోజు ఏర్పడింది. బాపు రూపకల్పనలో యీ చిత్రం రమణీయంగా రూపొందగలదు.

"భక్తి, రక్తి, శక్తి, అనురక్తి, యుక్తి విముక్తి" యొక్క సమగ్ర రూపమే "భక్త కన్నప్ప", చిత్రం.

## నచ్చిన పాత్రలు

శ్రీ వాణి ఆర్ట్స్ కంబైన్స్‌వారి "రక్తపాశం, శ్యామ్‌ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్; పల్లవి యింటర్నేషనల్ వారి ఇద్దరూ యిద్దరే; ఉదయిని ఆర్ట్స్‌వారి మేరే అప్నే; అమానుష్; రవీంద్రా ఆర్ట్ పిక్చర్స్‌వారి అమ్మా—నాన్న; ఆడవాళ్ళ—అపనిందలు" చిత్రాలలో కృష్ణంరాజు పోషిస్తున్న పాత్రలు ఆయనకు నచ్చేవిగానూ, ప్రేక్షకులు మెచ్చేవిగానూ వున్నాయి.

## నిర్మాతల స్నేహితుడు

"నిర్మాత బాగుండాలి; మంచి చిత్రం నిర్మించాలి; ఆ చిత్రానికి ప్రేక్షకాదరణ లభించాలి; అప్పుడే పరిశ్రమ మీద ఆధారపడ్డ వేలాదిమంది జీవితం ఆనందంగా వుంటుంది; అంటారు రాజు. అందరి సమిష్టి కృషి ఫలితమే చిత్ర నిర్మాణం. ఏ ఒక్కరి శక్తిమీద చిత్రం విజయవంతం కాదు అనేది నిజాన్ని నిర్భయంగా చెప్పే కృష్ణంరాజును నిర్మాతల స్నేహితుడు అనకూడదా ?

కృష్ణంరాజుగారికి వచ్చే వుత్తరాలను చూశాను. ప్రతి లేఖలో నాకు కామన్‌గా కనిపించిన అంశం ఒకటుంది.

"ప్రాధాన్యత లేని పాత్రలను వెయ్యొద్దండి. హెరోషియస్ పాత్రలను పోషించండి" అంటూ అభిమానులు రాస్తూ వున్నదానికి అనుగుణంగా కృష్ణంరాజు పాత్రలను ఎంపిక చేస్తున్నారు.

ఆయనకొచ్చే వుత్తరాలను చూచినప్పుడు, మరొక నిజం బయటపడింది.

కృష్ణంరాజును విద్యార్థులు, విద్యార్థినులు ఎక్కువ లైక్ చేస్తున్నారు.

## ★ సినిమా :

హిందీలో అమితాబ్ బచన్‌కు వచ్చిన ప్రేక్షకాదరణ తెలుగులో కృష్ణంరాజుకు రావాలని ఆశించే అభిమానులు అధికంగా వున్నారని, ఆయన లేఖలు చెప్పాయి.

## ముచ్చటయిన మూడు కథల దర్శకుడు

ఆంధ్రదేశంలోని ఆబాలగోపాలం మెచ్చుకునే వుత్తమ దర్శకుడు విశ్వనాథ్. ఆయన ముచ్చటయిన మూడు కథలను రాసి, వాటికి తనే దర్శకత్వం నిర్వహిస్తున్నాను.

ప్రతి కథ ఒక ప్రత్యేకతను బడసి వున్నప్పుడే, తన నిర్మాతలకు కథలివ్వేందుకు సాహసించే సమర్థుడు శ్రీ విశ్వనాథ్.

సత్య చిత్రకు, గీతా కంబైన్స్‌కు, వాచు శేషగిరిరావుకు విశ్వనాథ్‌గారిచ్చిన కథలు మాణిక్యాలే.



తను కావాలి అని వచ్చేవాళ్ళు ఎందరో వున్నా, అందరినీ అంగీకరించే డబ్బు మనిషికాదు శ్రీ విశ్వనాథ్,

తెలుగు చిత్ర జగతికి, కీర్తి ప్రతిష్ఠలను, అంతర్జాతీయ ఖ్యాతిని తేగల ప్రతిభావంతున్నుడు విశ్వనాథ్‌గారే.

"అమ్మా—నాన్న"లో జయసుధ



## శేషాలు ★

### దాసరి చెప్పిన కథ

సెప్టెంబరు పదవ తారీఖున, దాసరి నన్ను వైద్యరామయ్యర్ వీధిలోని పదునాలుగవ నెంబర్ యింటికి తీసికెళ్లారు

నే వెళ్ళేసరికి, అక్కడ సంగీత దర్శకుడు రమేష్‌నాయుడు, ఎడిటర్ బాలు, కళాదర్శకుడు భాస్కరరాజు కూర్చుని వున్నారు

ఒక వ్యక్తి ఏడుకొండలవాడి పటానికి కొబ్బరి కాయ కొట్టి, దాసరి దగ్గరకు హారతి పట్టుకొచ్చారు

ఆ వ్యక్తిని "స్వరాజ్యం లేచిపోయింది" చిత్ర నిర్మాతగా నాకు పరిచయం చేశారు

"మకుటం గమ్మత్తుగా వుంటే, కాస్త కథ వినిపించగలరా" అని అందరూ అడిగారు

గడుసరి కథ చెప్పారు ఆరు పాత్రల చుట్టూ ఒక విచిత్రమైన కుటుంబగాథను అల్లారాయన ఇప్పటివరకు రాని సంఘటనలు ఎన్నో వున్న కథ అనిపించింది

"స్వరాజ్యం లేచిపోయింది" చిత్రానికి ఆర్ సుబ్బారావు నిర్మాత, పోతిన శ్రీరాములు సమర్పకుడు ఈ సంచలనాత్మక చిత్రాన్ని అందించే సంస్థ పేరు అరుణ ఆర్ట్ పిక్చర్స్

### దాసరి - వాణిశ్రీ కలిసిన చిత్రం

అగ్రనటి వాణిశ్రీ, అగ్రశేణి దర్శకుడు దాసరి కలిసి పనిచేసే శుభ వేళ ఎప్పుడొస్తుందా అని ఎదురు చూచేవాళ్ళు ఎందరో వున్నారు అట్టివారి కోరిక యీడేరింది ఈ యిద్దరినీ కలిపిన వ్యక్తి పేరు పుష్పరాజ్ ఈయన గజానన ఫిలింస్‌కు అధినేత గజానన ఫిలింస్ తలపెట్టిన తొలి చిత్రంలో దాసరి, వాణిశ్రీ కలిసి పని చేస్తున్నారు ఈ చిత్రంలో రామకృష్ణ నాయకుడు సహాయ పాత్రలను సత్యనారాయణ, రాజబాబు పోషిస్తున్నారు

కథను నిర్మాత పుష్పరాజ్, రచన్ను అప్పలాచార్య, సంగీతాన్ని రాఘవులు నిర్వహిస్తున్నారు

### రవీంద్రాలో హిట్ హీరో

1975 లో హిట్ హీరో ఎవరో ప్రేక్షకులకే తెలుసు "దేవుడు చేసిన పెళ్లి" దగ్గర్నుంచి "జేబు దొంగ" వరకు ఆ హీరో నటించిన చిత్రాలు ఎంత డబ్బును ఆర్జించిపెట్టాయో, ఆయా ఎగ్జిబిటర్లు, డిస్ట్రిబ్యూటర్లు చెప్పగలరు

ఆధారంతో రాసే యీ నిజాన్ని కొందరు అపార్థం చేసుకుంటూ, ఆ హీరోకు నేను ప్రతినిధి అని విమర్శలు చేస్తూ వుంటారు

నిజాన్ని నిర్భయంగా చెప్పే ఆత్మధైర్యం జర్నలిస్టుకు చాలా అవసరం

మంచి చిత్రాలను నిర్మించే వుత్తమ చిత్ర నిర్మాణ సంస్థగా రవీంద్రా ఆర్ట్ పిక్చర్స్‌కు పేరు వుంది ఆ సంస్థ నిర్మించబోయే వర్ణ చిత్రంలో శోభన్‌బాబు నటించబోతున్నట్లు, "గుణవంతుడు" సెట్లో ఆయనే చెప్పారు

### కొత్త చిత్రంలో దాసరి - శోభన్

"చిట్టెమ్మ — చిలకమ్మ" చిత్రాన్ని నిర్మించిన ఎ వి రాజా తన బంధుమిత్రులతో కలిసి శశికళా మూవీస్ అనెడి సంస్థను స్థాపించి, హీ—మాన్‌కు అడ్వాన్స్ యిచ్చిన నిజాన్ని, శోభన్ ద్వారా విన్నాను

ఎ వి రాజాగారు శోభన్‌బాబుతో నిర్మించ బోయే వర్ణ చిత్రానికి గడుసరి కథకుడేగాక దర్శకుడు కూడా అని తెలుసుకున్నాను

"చిట్టెమ్మ - చిలకమ్మ" చిత్రం పూర్తి కాగానే, నిర్మాత ఎ వి రాజా నన్ను వెంటబెట్టుకుని వాణిశ్రీ యింటికి వెళ్ళి, ఆమె కాల్‌షీట్లు కోరారు

"హిట్ హీరో — అగ్రనటి — ప్రజాదర్శకుడు" కలిసి పని చెయ్యబోయే చిత్రం ప్రజానురంజకం కాకుండా వుండగలదా ?

### పరిశ్రమకు ఒకే తల్లి

తెలుగు చిత్ర రంగంలో తల్లి వేషం వెయ్యదగిన ఒకే వ్యక్తి అంజలీదేవిగారే అనిపిస్తుంది

ఎందుకంటె "జగపతి స్టాఫ్ ఎంటర్ ప్రైజస్ వారి పిచ్చి మారాజు, సురేష్ వారి సోగ్గాడు; శ్రీ విజయభట్ ప్రొడక్షన్స్‌వారి గుణవంతుడు, రాజ్యం పిక్చర్స్‌వారి చిత్రం, నరేంద్రావారి నవ్వుతూ బ్రతకాలి, రవికళావారి గాజుల కిష్టయ్య, చిత్రభాను వారి వధూవరులు" చిత్రాలలో, విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్‌వారి కొత్త చిత్రంలో తల్లి పాత్రను పోషిస్తున్నది అంజలీదేవి గాబట్టి, పరిశ్రమకు ఒకే తల్లిగా ఆమెను పేర్కొనవచ్చు

### కవయిత్రి

అంజలీ పిక్చర్ కంబైన్స్‌వారి "మహాకవి క్షేత్రయ్య" వర్ణ చిత్రంలో కవయిత్రి రంగాజమ్మగా అంజలీదేవి మహోత్కృష్టమైన పాత్రను పోషిస్తున్నది

అక్కినేని, ఆదుర్తి, ఆరుద్ర, ఆదినారాయణరావు, అంజలీదేవిగార్ల సమిష్టి కృషికి అఖండ విజయం తథ్యము

### ప్రభకు అక్కినేని ఆశీర్వాదం

"మహాకవి క్షేత్రయ్య" వర్ణ చిత్రంలో 'నట సామ్రాట్' నాగేశ్వరరావుగారితో ప్రభ నటిస్తున్న విషయం పాఠకులకు తెలుసు

ఈమధ్య "క్షేత్రయ్య" రషస్‌ను అక్కినేని చూశారని తెలిసింది ఆయన్ను ప్రభ నటన ఎలా వుంది అని ప్రశ్నించాను

"బాగానే చేసింది ఉజ్వల భవిష్యత్ వుంది" అన్నారు అక్కినేని ఆశీర్వాదం ప్రభకు మేలు చెయ్యగలదు



# సినిమా

## శివాజీతో మంచిమనుషులు !

తమిళ "నట సామ్రాట్" శివాజీతో రాజేంద్ర ప్రసాద్‌గారు "మంచిమనుషులు" చిత్రాన్ని తమిళంలో నిర్మిస్తున్నారు. మంజుల నాయికగా నటిస్తున్న యీ చిత్రానికి మహదేవన్, వెంకటరత్నం సంగీత, ఛాయాగ్రహణాలకు అధినేతలు.

## అగ్ర దర్శకుల దృష్టిలో రామకృష్ణ

నేటి ప్రేక్షక లోకం విశ్వనాథ్‌గారిని, దాసరి గారిని, బాపుగారిని, ఆదుర్తిగారిని, విక్టరీగారిని వుత్తమ దర్శకులుగా ప్రశంసల వర్షాన్ని కురిపిస్తోంది.

నేటి తరం రామకృష్ణగారిని విపరీతంగా ప్రోత్సహిస్తున్న విజాన్ని, ఆయనకొచ్చే వుత్తరాలు తెలుపుతున్నాయి.

అగ్ర దర్శకుల దృష్టిని రామకృష్ణ ఆకర్షించారు గాబట్టే, విశ్వనాథ్, దాసరి, బాపు, విక్టరీగార్ల చిత్రాలలో నాయకుడయ్యారు.

నాచు శేషగిరిరావుగారి "ఎవరూ చెప్పని కథ"లో (విశ్వనాథ్) దిడ్డి శ్రీహరిరావుగారి "ఏకలవ్య"లో (దాసరి) పింజల సుబ్బారావుగారి "సీతా కళ్యాణం" (బాపు) కుప్పుస్వామిగారి "దూరపు కొండలు"లో (విక్టరీ) రామకృష్ణ వెరైటీ వేషాలను వేస్తున్నారు.

ఆదుర్తిగారి దృష్టిని కూడా ఆకర్షించే రోజు త్వరలోనే వస్తుంది.



"చిట్టెమ్మ—చిలకమ్మ"లో గిరిబాబు, కె. విజయ

## జయసుధకు మరపురాని కథ

ఇప్పుడిప్పుడే ప్రజలకు దగ్గరవుతున్న నటి జయసుధ గ్లామర్ పాత్రలను మాత్రమే గాక, సోబర్ పాత్రలను ప్రతిభావంతంగా పోషించగలదని "లక్ష్మణరేఖ" ద్వారా నిరూపించింది.

"లక్ష్మణరేఖ" చిత్రంలో కవిత పాత్ర ఎంత విశిష్టమైనదో, అంతకంటె గొప్ప పాత్రను క్రాంతికుమార్ తను నిర్మిస్తున్న చిత్రంలో జయసుధకు యిచ్చారు.

జయసుధ నట జీవితానికి సార్థకతను తెచ్చిపెట్టే మరపురాని పాత్ర అన్నపూర్ణా సినీ ఎంటర్‌ప్రైజస్ వారి చిత్రంలో లభించడం ముదావహం.

ప్రజాభిరుచులకు అనుగుణంగా చిత్రాలను నిర్మించే సామర్థ్యత క్రాంతికుమార్‌కు వుంది. కథలు, కథనం క్రాంతికి వెన్నతో పెట్టిన విద్య.

క్యారెక్టర్ ఆర్టిస్ట్ సత్యనారాయణ ప్రధాన పాత్రను పోషింప, మురళీమోహన్, గిరిబాబు సహాయ భూమికలను ధరిస్తున్నారు. కె. రాఘవేంద్రరావు దర్శకత్వం, చక్రవర్తి సంగీతం, శ్యామసూరి సహకార దర్శకత్వం, అంకిరెడ్డి కూర్పు నిర్వహిస్తున్నారు.

చిన్ని ఆత్రేయ (సత్యానంద్) ఈ చిత్రానికి సంభాషణల రచయిత.

## పెద్ద సంస్థల రచయిత

ఆదుర్తి ఆశీర్వాద బలంతో సినిమా రచయితగా పరిచయమైన సత్యానంద్ నేడు క్రేజువున్న కలం మనిషిగా కీర్తి పొందుతున్నాడంటె, ఎంత బలం కలిగినవాడై యుండాలి ?

పెద్ద సంస్థ లన్నిట్లో సత్యానంద్ పేరు మాత్రమే వినిపిస్తున్నదంటె, ఆయన కలం ఎంత పదును కలిగి యుండాలి ?

"గాజుల కిష్టయ్య, పిచ్చిమారాజు, ఇద్దరూ యిద్దరే, గుణవంతుడు, ఈకాలపు పిల్లలు, రాజా వెడలె, విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్, అన్నపూర్ణా సినీ ఎంటర్‌ప్రైజస్, అమానుష్, భక్త కన్నప్ప, బ్రతుకే ఒక పండుగ" చిత్రాలకు సత్యానంద్ సంభాషణల రచయిత. వర్తు వున్నదిగాబట్టే, అందరినీ ఆకర్షించగలిగాడు.

## జయసుధకు శోభన్ ప్రశంస

"సోగ్గాడు" వర్ణ చిత్రంలో హీ—మాన్ శోభన్‌బాబుగారితో జయసుధ నటిస్తున్నది.

గత వారం శోభన్‌బాబును కలిసినప్పుడు జయసుధ భవిష్యత్తు ఎలావుంటుంది అని ప్రశ్నించాను.

మరో రెండేండ్లలో జయసుధ ప్రామినెంట్ స్టార్ అవుతుంది అన్నారాయన. శోభన్ దీవెన వృధాపోదు.

## ఊటీలో పిచ్చిమారాజు

జగపతి స్టాఫ్ ఎంటర్‌ప్రైజస్‌వారి "పిచ్చిమారాజు" వర్ణ చిత్రం షూటింగు కొంత భాగం ఊటీలో జరుగుతుంది. ఖర్చుకు వెనకాడక, ప్రేక్షకులకు నచ్చే అంశాలన్నీ జొప్పించి, వారిని ఆకర్షించే కిటుకు జగపతి అధినేతకు తెలుసు. అందుకే ఆయన నిర్మించిన, దర్శకత్వం నిర్వహించిన చిత్రాలు ప్రజాదరణ పొందుతున్నాయి.

జగపతి చిత్రాలలో సంగీతం అందరినీ ఆకట్టుకుంటుంది అన్నది జగమెరిగిన సత్యం. "పిచ్చి మారాజు" చిత్రంలోని పాటలు 'దసరాబుల్లోడు' పాటలతో పోటీపడ్డాయి అనక తప్పదు.

అంత పులకింత వున్న పాటల చిత్రీకరణ కోసమే, రాజేంద్రప్రసాద్‌గారు ఊటీ పయనం పెట్టుకొన్నారు.

"పిచ్చి మారాజు" పాత్రలో సరికొత్త శోభన్‌బాబు కనిపిస్తారు. మంజుల తన ముగ్ధమోహన రూపంతో ప్రేక్షకులను ఆనందపరుస్తుంది.

హాస్యం యొక్క విభాగాన్ని రాజబాబు, అల్లు రామలింగయ్య, ధూళిపాళ నిర్వహిస్తున్నారు. తల్లిగా అంజలీదేవిని మించిన నటి వున్నదా ?

సంగీతానికి మహదేవన్, సాహిత్యానికి ఆత్రేయ, సంభాషణానికి సత్యానంద్, ఛాయాగ్రహణానికి వెంకటరత్నం సారథులయ్యెండ, ఆ శాఖల ప్రతాపం గూర్చి రాయాలా ?

రాబోయే సంక్రాంతి పర్వదినానికి, "పిచ్చిమారాజు" ప్రేక్షకులను పరవశింప చెయ్యాలని నిర్ణయించుకున్నాడు. అన్నపూర్ణ పంపిణీ సంస్థకు పలుకుబడిని పెంచే చిత్రం "పిచ్చిమారాజు".



"గుణవంతుడు"లో శోభన్, జయసుధ

## చక్రవర్తికి చక్కటి అవకాశం

"గుండెలు తీసిన మొనగాడు" చిత్రం ద్వారా, దర్శకుడిగా పేరు తెచ్చుకున్న చక్రవర్తికి తన శక్తిని నిరూపించుకొనేందుకు మరో చక్కటి అవకాశమొచ్చింది యిటీవల. శ్రీ జయవాణీ ఆర్ట్స్ పతాకం క్రింద జాగర్లమూడి జగదీష్, కృష్ణప్రసాద్‌గార్లు నిర్మిస్తున్న తొలి సాంఘిక చిత్రం "అదృష్టవంతురాలు"కు చక్రవర్తిని దర్శకుడిగా ఎన్నుకున్నారు నిర్మాత.

ఈ చిత్రం ఎం. జి. ఆర్. స్టుడియో అయిన సత్యానంద్ స్టుడియోలో ఆగస్టు యిరువది ఏడవ తేదీ ప్రారంభమైంది. నవయుగ చంద్రశేఖరరావు గారు స్విచ్ ఆన్ చేయగా, పి. ఏ. పి. సుబ్బారావు గారు క్లాప్ కొట్టగా, తొలి షాట్‌ను, నాగభూషణం, దేవదాస్‌ల మీద చిత్రీకరించారు దర్శకుడు చక్రవర్తి.

సత్యనారాయణ, షావుకారు జానకి, చలం, ప్రభ, ఉదయచంద్రిక ముఖ్య పాత్రధారులైన ఈ చిత్రంలో జగ్గయ్య, రాజ్‌బాబు, రమాప్రభ అతిధి నటులుగా నటిస్తున్నారు. గుహనాథన్ కథ, వీటూరి సంభాషణలు, కళాకార్ కళ, సత్యం సంగీతం, పి. యస్. ప్రకాష్ ఛాయ, కోటగిరి గోపాలరావు కూర్పు, జి. తిరుపతిరాయుడు నిర్వహణలో త్వరితగతిని పురోగమిస్తున్న యీ చిత్రాన్ని నవయుగ విడుదల చేస్తుంది.

## రాజా వెడలె...

ఈ ఏడు ఆరంభంలో "దేవుడు చేసిన పెళ్లి" వర్ణ చిత్రాన్ని అందించిన అట్లూరి పూర్ణచంద్రరావుగారు, యీ ఏడు చివరన ఆరంభించనున్న వర్ణ చిత్రానికి యిడిన పేరే "రాజా వెడలె".

ఈ చిత్రంలో హిట్ హీరో వినూత్నమైన పాత్రను పోషిస్తున్నారు. రాజా గెటప్‌లో కనిపించి, నవ్విస్తూ, మామూలు మనిషి వేషంలో అగుపించి, కరుణ రసాన్ని చిలికిస్తారు.

'హీ-మాన్'కు ప్రేయసిగా జయసుధ నటిస్తున్న "రాజా వెడలె" చిత్రానికి తాతినేని రామారావు దర్శకుడు.

సహాయ పాత్రలను సత్యనారాయణ, రాజబాబు, మురళీమోహన్, జయప్రద పోషించగలరు.

చిత్ర చిత్ర ప్రవర్ధమాన మవుతున్న సత్యానంద్ "రాజా వెడలె" చిత్రానికి సంభాషణల కర్త. లక్ష్మి ఫిలింస్ విడుదల.





"రక్తపాశం"లో కృష్ణంరాజు, కామినీదేవి

# సినిమా

### డి వి ఎస్ లో హిట్ హీరో

"జీవనజ్యోతి" చిత్రం అసాధారణ విజయాన్ని సాధించడమేగాక, అందులో శ్రీనివాసరావు పాత్రను పోషించిన శోభన్‌కు ఆడవాళ్ల అమోఘ ఆదరణను ఆర్జించిపెట్టింది

గత వారం నేను శోభన్ యింటికి వెళ్ళాను అప్పుడు వుదయం ఏడుగంటల సమయం అప్పటికే 'హీ – మాన్' ఆఫీసు రూములో యాక్టివ్‌గా కూర్చుని, మిత్రులతో పిచ్చాపాటీ చేస్తున్నారు

ఏమిటి విశేషాలు అని నన్ను అడిగారు "చెప్ప వలసినది మీరు, అద్దాన్ని ప్రజలకు తెలపవలసినది నేను" అన్నాను

ఇప్పుడే డి వి ఎస్ రాజుగారు వచ్చి, కథ చెప్పి వెళ్ళారు ఫిబ్రవరి నుంచి ఆయనకు చేస్తున్నాను, అన్నారు శోభన్

### ఎన్ని చిత్రాలు !

రోజా అయిదారుగురు వస్తున్నారు, శోభన్‌తో చిత్రం నిర్మించాలని ఎవర్ని వద్దనాలో, ఎవరికి యివ్వాలో అర్థంగాని పరిస్థితి శోభన్‌ది "నేను చెయ్యలేను మరోలా అనుకోవద్దు" అని నచ్చచెప్ప డానికి వారంరోజులు పడుతూంది అన్నారు శోభన్

### మాణిక్యాల్లాంటి నిర్మాతలు

నాతో చిత్రాలు నిర్మించే నిర్మాతలందరూ మాణిక్యాల్లాంటివారు కావడం నా అదృష్టంగా భావిస్తున్నాను, అన్నారు జేబుదొంగ

నేను బాగుండాలి అని కోరుకునే నా నిర్మాత లందరూ నిర్మించే చిత్రం బాగా రావాలి అని శ్రమించేవాళ్ళు గావడం మరింత ఆనందకరమైన విషయం, అన్నారు గుణవంతుడు

### ప్రారంభం అయ్యే కొత్త చిత్రాలు

సత్య చిత్రవారి వర్ణ చిత్రం సెప్టెంబరు యిరవై అయిదున ఆరంభం వాణిశ్రీ నాయిక విశ్వనాథ్‌గారు దర్శకుడు నిర్మాతలు: సత్యనారాయణ — సూర్యనారాయణగార్లు

విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్‌వారి వర్ణ చిత్రం, అక్టోబరు యిరవై నుంచి షూటింగు ప్రారంభం మంజుల, జయసుధ నాయికలు శ్రీ టి కృష్ణ దర్శకుడు నిర్మాత త్రివిక్రమరావుగారు

శ్రీ లక్ష్మి ప్రొడక్షన్స్‌వారి "రాజా వెడలె" వర్ణ చిత్రం షూటింగు నవంబరు పది నుంచి ప్రారంభం జయసుధ నాయిక తాతినేని రామారావుగారు దర్శకుడు శ్రీ అట్లూరి పూర్ణచంద్రరావు నిర్మాత

అనిల్ ప్రొడక్షన్స్‌వారి వర్ణచిత్రం డిశంబరులో ప్రారంభం వాణిశ్రీ నాయిక తాతినేని ప్రకాశ రావుగారుదర్శకుడు శ్రీ టి ఎల్ వి ప్రసాద్‌నిర్మాత

— శ్రీనివాస్



"దేవుడే దిగివస్తే"లో ఒక దృశ్యం

## గాజు మేడ

(23వ పేజీ తరువాయి)

"కావాలని తనని తాను మీకు అర్పించుకోబోతే మీరు కాదని తృణీకరించారటగా ఒకటి రెండు సార్లు ?"

ప్రభాకరం త్రుళ్ళిపడ్డాడు...ఇలాంటి పెర్సనల్ విషయాలు కూడా ఇతనికి చెప్పిందన్న మాట !... ఊ... సరే !...

"మాధవ్ ! ఇలాంటి సంగతులు మనం మాట్లాడుకోవడం ఏం బాగుండదయ్యా !" తీవ్రంగా అన్నాడు ప్రభాకరం.

మాధవ్ నొచ్చుకుంటూ "అయితే క్షమించండి" అన్నాడు. ప్రభాకరం కాస్సేపటికి స్థిమిత పడి... "అది కాదు మాధవ్... ఒక స్త్రీ ఉజ్జ్వల భవిష్యత్తు కోసం కలలు గని ఆమెని అలా తీర్చి దిద్దాలని నువ్వు కృషి చేస్తున్నావనుకో !... ప్రణయ తాపంతో ఆమె ఎప్పుడైనా నిన్ను బంధించబోతే, నువ్వు నిగ్రహం చూపించి, లాలనగా నచ్చచెప్పి ఆమెని పంపించవా ?" తేలిగ్గా అడిగాడు ప్రభాకరం

మాధవ్ ఉలిక్కిపడ్డాడు

తను అలా ప్రవర్తించగలడా ?

ఇంపాసిబుల్ ! . తను ప్రభాకరం అంత ఉన్నతుడు కాదు.

అసలు, ఉషని ఇంత స్వార్థరహితంగా, తను ప్రేమించగలడా ?

కాస్సేపాగి నిట్టూర్చి "ఊ మీరిలా ఆలోచించారు కాని మీ ప్రవర్తన ఉషకి ఇంకోలా అర్థం అయింది."

ప్రభాకరం ఆత్రుతగా "అంటే ?" అన్నాడు

"మీరు తనని పెళ్లి చేసుకోరనీ, తను మీకు అక్కర్లేదనీ అనుకుంది"

"నిజంగా ?"

"అంతటితో ఆగిపోలేదు . తన మనస్సుని ఇంకొకరికి ఇచ్చింది ."

"మాధవ్ !"

"అతణ్ణే పెళ్లి చేసుకోబోతోంది కూడా !"

"ఏమిటి నువ్వంటున్నది ?"

"ఆమె హృదయంలోంచి మీ రూపం ఇంకా చెరిగిపోలేదు అది చెరిపేసుకోవాలంటే ఆమెకి కృతజ్ఞత అడ్డువస్తోంది ఆమెని ఇంత చేసి ఈ స్థితికి తీసుకువచ్చిన మీకు ఎంతో ఋణపడి ఉన్నానని అంటోంది ఆ ఋణం నుంచి తనని విముక్తి చేస్తేనేకాని పెళ్లి చేసుకో డానికి వీలులేదని షరతు పెట్టింది ఆ పెళ్లి కొడుక్కి అందుకే నేను వచ్చాను మీ ఋణం నుంచి ఆమె ఎలా విముక్తి అవుతుందో చెప్పండి ఎంత యిస్తే ఆ ఋణ విముక్తి ఆమెకి అనుగ్రహిస్తారు ?" యిలా చెప్పుకుపోతూన్న మాధవ్, ప్రభాకరం పరిస్థితి ఏం గమనించలేదు

అప్పటికే ప్రభాకరం మండపం స్తంభం మీదకి ఒరిగిపోయాడు ఆ వెన్నెల రాత్రి అంతా ఒక్కమారు చీకటి అయిపోయినట్లూ, ఆ చీకట్లో దూరంగా నిలబడి తన అదృష్టం తనని పరిహసిస్తున్నట్లూ అనిపించింది ప్రభాకరానికి స్పృహ

# డాక్టర్లు చెబుతున్నారు, 3 నెలలు దాటినప్పటినుంచి పాలు మాత్రమే చాలవు. ఆరోగ్యకరమైన రక్తానికి తగినంత ఐరన్ కలిగిన ఘన ఆహారం మీ బిడ్డకు అవసరం.




మీ పెరిగే బిడ్డకు ఫారెక్స్
ఏమి సమకూర్చుతుందో చూడండి :

- ఆరోగ్యకరమైన రక్తము మరియు సత్తువకు తగినంత ఐరన్
- బలమైన పళ్ళు మరియు ఎముకలకు కాల్షియమ్ మరియు విటమిన్ $D_2$.
- త్వరితమైన పెరుగుదలకు తోడ్పడే తేలికగా —జీర్ణము కాగలిగిన ప్రొటీన్.
- అతని వయస్సు మరియు మారుతూ ఉండే అవసరాలకు అనుగుణ్యంగా తగినంత శక్తి.

మీ బిడ్డ పెరుగుదలకు అనుగుణ్యంగా ఫారెక్స్ అవసరం

| మీ బిడ్డ వయస్సు | ఫారెక్స్ ఎంత కావాలి |
|---|---|
| 3—6 మాసాలు | 1—2 టీ చెంచాలు రోజుకు రెండు సార్లు |
| 6—9 మాసాలు | 3—4 టీ చెంచాలు రోజుకు మూడు సార్లు |
| 9 మాసాలు— 3 సంవత్సరాలు | 4—6 టీ చెంచాలు రోజుకు నాలుగు సార్లు |




# ఫారెక్స్

3 నెలలు దాటినప్పటినుంచి సంపూర్ణమైన పెరుగుదలకు మీ బిడ్డయొక్క మొట్టమొదటి ఘన ఆహారం.

ఉచితం: ఫారెక్స్ పుస్తకం, దయచేసి మీ పేరు మరియు అడ్రసు ఇస్తూ (ఏ భాషలో కావాలో తెలియజేస్తూ) 25 పైసల తపాలా బిళ్ళలతో ఈ క్రింది అడ్రసుకు వ్రాయండి: ఫారెక్స్ డిపార్ట్‌మెంట్ AP-1, పోస్ట్ బాక్స్ 16556, [illegible] 600 028.

గ్లాక్సో

CMGF 47-234-TL

కొల్పోతున్నాడో తెలివిగా వున్నాడో అతనికే తెలియడం లేదు. ఆకాశాన్నంటుతున్న మంటలా, నిస్పృహతో కూడిన ఆవేదన అతని గుండెల్ని దహించివేస్తోంది. నరనరాల్లోనూ నీరసం వ్యాపించి బ్రతుకే ఒక శూన్యంలా మారిపోయింది.

ఇదీ అని చెప్పలేని ఒక మహావేదనామయ స్థితిలో కొంచెంసేపు కొట్టుమిట్టాడి, తర్వాత కళ్ళు తెరిచాడు ప్రభాకరం. మాధవ్‌కేసి చూసి ''అయితే మాధవ్! ఉష పట్ల నాకున్న ప్రేమని కొనడానికి వచ్చావన్నమాట! మంచి బేరగాడ వయ్యా! ఉషే పంపిందా నిన్ను, తనని ఋణ విముక్తురాలిని చెయ్యమని? అయితే సరే. వెళ్ళి ఆమెతో చెప్పు ... నా ఋణం విలువ ఒక ప్రాణం అని. అవునయ్యా! అలా తెల్లబోతావేం? నాకేం మతిపోయి మాట్లాడడంలేదు ఋణ విముక్తురాలు అయి ఆ తర్వాతే పెళ్లి చేసుకోవాలంటే, ప్రభాకరం ప్రాణం యిస్తేనే ఆ ఋణం తీరుతుందని చెప్పి .. వచ్చి పట్టిగెళ్ళమను ఈ ప్రాణాన్ని. లేదా, యీ ఋణం తీరదు. ఈ ఋణభారంతోటే పెళ్లి పీట్ల మీదకి వెళ్ళమను చివరకి ఉష యిలా


''రాము—సోము''లో ...రిబాబు, ప్రభ ...

చెప్పి పంపిందా నిన్ను? ఉషే పంపింద... ఉషే చెప్పి పంపిస్తే నేనేం చెప్తాను? ఇంతకీ ఆ పెళ్ళికొడుకు నువ్వేనా? నువ్వే అయివుంటావులే! అదిగో నీ తలమీద బొగడపువ్వుల తలంబ్రాలు కూడా పడుతున్నాయి నిజం! నువ్వే పెళ్లికొడుకువి .. నువ్వే అదృష్టవంతుడివి ... నువ్వే నువ్వే''

హఠాత్తుగా ప్రభాకరం మాట్లాడ్డం మానేసి,

''అరే, చాలా పొద్దుపోయిందే! నడవండి మాధవ్ యింటికి పోదాం'' అన్నాడు

మాధవ్ నిట్టూరుస్తూ లేచాడు

## *22*

కవరులో పదివేల రూపాయలకి ఒక చెక్ పెట్టి, కవరుమీద ''ఉషకి చదువు చెప్పించినందుకు'' అని రాసి, ఆ కవర్ని ప్రభాకరం టేబిల్ మీద వుంచి, ఆ విధంగా ఉష ఋణ విముక్తురాలైంది అని తృప్తిపడుతూ, యింకా ప్రభాకరం నిద్రనుంచి లేవకముందే, అతన్ని లేపి అతని దగ్గర సెలవు తీసుకోకుండానే, దొంగలా ఏదో తప్పు



చేస్తున్నవాడిలా బాధపడుతూ, తెల్లారకుండానే వెళ్ళిపోయాడు మాధవ్.

తెల్లారేక లేచి ఆ కవరు చూసుకుని మ్రాన్పడిపోయాడు ప్రభాకరం సరే ఈ సలహాకూడా ఉషే యిచ్చిందన్నమాట! తనతో ఏ ఋణాను బంధం వుండకూడదనికాబోలు! .. ప్రభాకరం మనస్సు విలవిల్లాడిపోయింది. మతిలేనివాడిలాగ కుర్చీలో అమట్టునే కూలబడి వుండిపోయాడు.

''పదిగంటలు కావస్తోంది డాక్టరుగారు హాస్పటల్‌కి యింకా రాలేదేమిటి?'' అని చెప్పి జానీ సీతాల్ని లోపలికి పంపించింది వాడు వచ్చి ప్రభాకరాన్ని పలకరించడానికి భయపడి తిరిగి వెళ్ళిపోయాడు. చివరకి జానీయే వచ్చింది. వస్తూనే ''మీరిలా కూర్చుండిపోయారేమిటి? యివాళ ఆపరేషన్ కేసు వుందికదా. అన్నీ సిద్ధం చేయించాను రండి'' అంది. ప్రభాకర్ జాలిగా నవ్వి ''జానీ! యింత సామర్ధ్యం, సేవాతత్పరత వున్న డాక్టరువికదా .. ఎవరేనాసరే .. నిన్ను నెత్తిన పెట్టుకుని వుద్యోగం యిస్తారు. వెళ్ళి ఎక్కడేనా జేరకూడదూ? మా అమ్మని ఏ నర్సింగ్ హోమ్ లోనో జేర్పించేసి నేనలా హృషికేశమో బదరీనాథ్‌కో వెళతాను మనశ్శాంతికోసం'' అన్నాడు.

''మీ వేదన నాకు తెలుసు. కాని వూళ్ళు పోతే మనశ్శాంతి వస్తుందా? మనం ఎక్కడికి వెళ్ళినా మన మనస్సూ ఆలోచనలూ మనతోటే వుంటాయి ఊఁ! లేవండి ఆపరేషన్‌కి అన్నీ సిద్ధంచేశాను.''

''నేనీ పరిస్థితిలో ఆపరేషన్ చెయ్యలేను జానీ! మనస్సంతా ఏదో పోగొట్టుకున్నట్లు వెలితిగా బాధగా వుంది ఆ పేషెంటుని మరో డాక్టరు దగ్గిరికి వెళ్ళమను.''

''ఈ సమయంలో, తీరా అంతా రెడీ అయ్యాక అలా అంటే ఎలాగండీ! నిన్న సాయంత్రమే కదా ఆ పేషెంట్ సంగతి చెప్పాను ఇంకో నాలుగైదు గంటల్లో ఆపరేషన్‌చేసి కాలు తీసెయ్యకపోతే, మొత్తం బ్లడ్ అంతా పాయిజన్ అయిపోయి ప్రమాదం సంభవిస్తుంది డాక్టరుగా మీరు వెంటనే గ్లౌస్ వేసుకుని రావలసిందే! ఇది వృత్తి ధర్మం మీ వ్యక్తిగతమైన సమస్యలు అలా వుంచండి సాటి డాక్టర్‌గా మిమ్మల్ని హెచ్చరించవలసి వస్తోంది'' అంది జానీ

తప్పనిసరిగా లేస్తూ ''నేను ఆపరేషన్ చెయ్యగలనంటావా?'' అన్నాడు ప్రభాకరం జాలిగా

''తప్పకుండా చెయ్యలరు. అసలు లేవండి'' అంటూ అప్పుడు ఉత్సాహం కలిగించిన జానీ, ఆపరేషన్ థియేటర్‌లో కూడా అతనికి అనుక్షణం ప్రోత్సాహాన్ని కలిగిస్తూ చివరకి అతనిచేత ఆపరేషన్ విజయవంతం చేయించింది ఇవతలకి వచ్చి, పెద్ద కుంకంబొట్టుతో కనిపించిన పేషెంట్ భార్యని చూసేసరికి, ఆమె బొట్టు నిలబెట్టిన సంతృప్తిలో ఒక్క క్షణం తన ఆవేదనని మరిచిపోయాడు ప్రభాకరం — ఆమె తనకి దణ్ణం పెడుతూంటే ''అదిగో అక్కడ డాక్టరమ్మ జానీగారున్నారు. ఆమెకి చెప్పుకోండి మీ కృతజ్ఞతలు. నాకు కాదు'' అన్నాడు...

ఎంతో శ్రమ పడినట్లు శరీరం అంతా విపరీతమైన నెప్పులుగా ఉంది... ''తక్కినవన్నీ నువ్వు చూసుకో జానీ - నేను వెళ్లి రెస్ట్ తీసుకుంటాను'' అని ప్రభాకరం లేచి లోపలికి వెళ్లబోతూంటే, లీల అయిదారు నెలల పసివాడిని చంకనేసుకుని, టేక్సీ దిగింది. ప్రభాకరాన్ని చూస్తూనే బావురుమని ఏడవబోయింది... ప్రభాకరం కళ్ళతో సంజ్ఞ చేసి, చంటాడిని అందుకొని, ఆమెని సరాసరి లోపలికి మేడమీదకి తీసుకెళ్లిపోయాడు .. పది పదిహేను నిముషాల వరకూ గుండె బరువు తగ్గేలా ఏడ్చేసి, ఆ తర్వాత స్థిమితంగా చెప్పింది.

'వీడిని నాలుగో నెల కడుపుతో ఉండగా మురళితో పోట్లాడి పుట్టింటికి వెళ్లాను. . మొదట నాతో ఢిల్లీ రానన్నా, తర్వాత నా వెనకాల రాకేం చేస్తాడనే ధైర్యంతో — అప్పటికీ ఇప్పటికీ రాలేదు సరిగదా, రాసిన ఉత్తరాలకి కూడా మురళి సమాధానం రాయలేదు. సరాసరి నేను మురళి దగ్గరకే వెళితే, అతను నన్నెలా స్వీకరిస్తాడో, పాత కోపం పట్టుదలా తగ్గక, అసలు మనకి పెళ్లే జరగలేదు కదా — నువ్వెవరు, నే నెవరు అంటూ అవమానపరుస్తాడేమో .. ఏమైనా పట్టుదలల మధ్య మా సంసారం ఈ పసివాడూ నలిగిపోగూడదని నిర్ణయించుకుని, ఇలా నీ దగ్గరికి వచ్చాను నువ్వు, మా సంసారాన్ని ఎలా పొత్తు చేస్తావో — నీదే భారం మురళి ఎవరు చెప్పినా వినే మనిషి కాదు . నీ మాట మాత్రం కాదనడు. ఇది ఇలా ఉండగా నేను మళ్లీ ఢిల్లీ వెళ్లడానికి కాని, రెండు రోజులు నాన్న దగ్గర, ఉండడానికి కాని వీలు లేని పరిస్థితి వచ్చింది. అమ్మ పోవడం, నేను నాలుగైదేళ్ళు ఇలా నాలుగూళ్ళూ తిరగడంతో నాన్నగారు మరీ పేకాటకీ, గుర్రపు పందేలకీ, స్నేహితులకీ, విలాసాలకీ బానిస అయిపోయారు దానికి తోడు ఈ మధ్య కాలంలో మా అమ్మ స్థానంలో ఒకామె వచ్చి నాన్నతో సహా మొత్తం ఇంటినంతనీ తన స్వంతం చేసుకొంది ఇంక నే నక్కడ ఎలా ఉండగలను చెప్పు అన్నయ్యా .'' అంటూ బావురుమంది లీల

ప్రభాకరం ఆమె నోదార్చి, ''బాధ పడకు. మురళికి టెలిగ్రాం ఇచ్చి రప్పించి, అతన్ని ఎలాగో అలాగ సమాధానపరిచి మీ సంగతి పరిష్కారం చేస్తాను అయినా అమ్మాయ్! నీకు అంటే కోపంగాని, ముందుచూపు లేకుండా అతనితో సంసారం ప్రారంభించడం అంత వివేకం అయిన పనిగాదు. పెళ్లి అనే బంధం లేకపోతే మగాడికి బాధ్యత మొయ్యదు ఇప్పటికేనా నీ పద్ధతి మార్చుకొని అతనితో ఆ పెళ్లి తంతు యేదో పూర్తిచేసుకో''

''అంతా నీ యిష్టం అన్నయ్యా! నువ్వెలా చేసినా సరే'' అంటూ తల వంచేసింది లీల.

లీల రావడం తెలుసు జోగమ్మకి · చంటాడిని చూపిస్తే సంతోషించిందికూడా. కాని ఆ రాత్రే కాలూ చెయ్యితోపాటు నోరుకూడా పడిపోయి, పూర్తి పక్షవాతం వచ్చేసి, అపస్మారపు స్థితిలో వుండిపోయింది.

(ఇంకా వుంది)

— సీరియల్ —

# రాగదీపికలు

— ఆదూరి
వేంకటసీతారామమూర్తి —

*(గత సంచిక తరువాయి)*

"మళ్ళీ మీ యింటి గడప తొక్కడానికి మనస్కరించలేదు. మీకు నా క్షమాపణలు చెప్పుకొనే అవసర మెంతైనా వుంది" వర్ధనికొంచెం మెత్తబడింది. ఇద్దరూ దారిలో నున్న ఓ పార్కులోకి దారితీశారు. సిమ్మెంటు బెంచీపై ఆమెకు కాస్త దూరంలో కూర్చున్నాడతడు. ఆరోజు రజనీకాంత్‌తో వర్ధనిని చూసింది మొదలు గిరిలో మార్పు కన్పిస్తోంది రజనీకాంత్ క్రింద పనిచేసే పాతిక మందిలో గిరి ఒకడు. బాస్‌కు వర్ధని యే రకమైన చుట్టమో తేల్చుకోలేకపోయినా తను చేసిందానికి క్షమాపణలు చెప్పుకోవాలని తాపత్రయ పడుతున్నాడు.

గిరి చెప్పిన విషయాలను వింటూ ఆశ్చర్యంగా వుండిపోయింది వర్ధని. తనను చూసింది మొదలు ఆరాధిస్తూ పెళ్ళి చేసుకోవాలనుకోవడం, అందుకు తను సమ్మతి తెలియజేయక పోవడంతో ఎలాగైనా తనను పొందాలనుకోడం — ఆ సమయానికి తను కాక సుందరి బలైపోడం. గిరి దాపరికం లేకుండా చెబుతూంటే అతనిపై ద్వేషం పోయి ఆశ్చర్యం మిగిలింది. చివరగా గిరి మరో సంగతి కూడ జోడించాడు. సుందరిని మనస్ఫూర్తిగా స్వీకరించడానికి అతనికేం అభ్యంతరం లేదని!

మనిషికి క్షమాపణ గొప్పది. తను చేసిన తప్పుకు పశ్చాత్తప్త పడిన మనిషికి —శిక్ష అనవసరం.

సుందరి జీవితం అప్పటికే పతనమై పోయిందనీ యిక ఆ సంఘటనతో ఆమెకీ జీవితంపైనే విరక్తి కలిగి బ్రతుకునే బలి చేసుకునే ప్రయత్నంలో వెళ్ళిపోయిందనీ అతతో చెప్పడానికి వెనుకాడలేదు వర్ధని.

"ఒక నిండు జీవితాన్ని బలిగొన్నాను — నాకు మీరేశిక్ష విధించినా ఆనందంతో స్వీకరిస్తాను" ఈ మాటలంటున్న గిరి కన్నుల్లో బాధను ప్రత్యక్షంగా చూసి చలించిపోయింది.

ఆవిషయాన్ని వీలైనంత రహస్యంగానే వుంచాలని అభిప్రాయపడింది.

*　　*　　*

'మేరేజస్ ఆర్ మేడిన్ హెవెన్' అన్నారు, అందుకేనేమో తన పెళ్ళివిషయం రజనీకాంత్ తొందర పెట్టినపుడు కవితను తన వదిన గారిగా చేసుకుంటానని వర్ధని అనడంలో మరేం మాట్లాడలేకపోయాడు. ఈ ప్రసక్తి తెచ్చేముందు అన్నగారి నోసారి కదిల్చింది వర్ధని. అట్టే శ్రమపడకుండానే కవితకూడా తన అంగీకారాన్ని తెలియజేసింది.

కానీ యిప్పుడు మరొక చిక్కొచ్చిపడింది. కవిత సంగతి తెలిస్తే పెద్దవారందుకు ఒప్పుకుంటారా అని!

ఆ భారాన్ని కూడ తనపై వేసుకుంది వర్ధని. నిజానిజాలు చెబితేనేగా తెల్సేది! జీవితాలు సుధామయ మయ్యేందుకు మనిషి గుణగణాలు సత్ప్రవర్తనలే ముఖ్యం.

రాజశేఖరంగారి సంగతి విని శుభం అన్నారు. ఎవరికాళ్ళమీద వాళ్ళు నిల్చినపిదప ఆలోచించి చేసుకుంటూంటే ఎవరు కాదనగలరు? ఆ అభిప్రాయాన్నే ఆయన వ్యక్తం చేశారు.

ఈ సంగతులెలా చెప్పాలా అని బెదురుతూనే తాతగారి దగ్గరకు వెళ్ళిన ప్రసాద్ ఆయన నోటివెంట తనాశించిన సమాధానం రాకపోయేసరికి ఆశ్చర్యపోయాడు.

మాధవరావుగారిలో మార్పు కన్పిస్తోంది; మొదటినుండీ ఆయన మాట కెదురుండేది కాదు. భార్య, కొడుకులు, కూతుళ్ళు అంతా అతని మాటకు గడగడలాడుతూ జవదాటే వారు కాదు. పిల్లలు పెద్దయ్యాక కొడుకుల హోదాని తన హోదాగా భావించి ఓ మెట్టు పైకే ఎక్కికూర్చున్నారు.

కట్నంకింద యిచ్చిన పదివేల మాటెలా వున్నా లక్షాధికారని పిల్లనిస్తే లక్షల ఆస్తితో పాటు కట్నంరూపేణా తనిచ్చిన దాన్నీ వ్యసనాలకి కరగబెట్టేసిన పెద్దల్లుడంటే కోపంతోపాటు అసహ్యంకూడ్క పెరిగిపోయింది.

అందుకే యిల్లుబట్టని వాడివి నీకు సంసార మెందుకని అల్లుడితో జగడమాడి కూతుర్నీ పిల్లల్నీ తీసుకొచ్చేశాడు - కొన్నాళ్ళు బాగానే గడిచింది — ఆ తర్వాతర్వాత స్వంత బిడ్డనే పరాయిదానిగా చూడ్డం మొదలుపెట్టాడు. అల్లుడొచ్చి తొంగిచూడ్డానికి కూడ ఒప్పుకునేవాడుకాదు మాణిక్యమ్మ మాత్రం భర్త వచ్చాడని తెలియగానే చాటుమాటుగా కల్సుకుని ప్రాధేయపడేది — తండ్రి బుద్ధులు కొడుకుల కెందుకు రావూ అని ముసలాయన తర్కం అందుకే ఆమె పిల్లలపైకూడ చిన్న చూపే వుండేది.

చిన్నహాతుకు రజేశ్వరంటే మాధవరావుగారికి అమితమైన అభిమానం — రోజులు

> *జరిగినకథ : 11* చదువుకుని ఉద్యోగంచేసి కుటుంబాన్ని ఆదుకోవాలనే వుద్దేశ్యంతో విశాఖపట్నం వచ్చిన వర్ధనికి, రాజశేఖరం మామయ్య ప్రోత్సాహం లభిస్తుంది. వర్ధని అన్న ప్రసాద్ చిరుద్యోగి. స్నేహితుడు రజనీకాంత్‌ని వర్ధనికి పరిచయం చేస్తాడు ప్రసాద్. వర్ధని మెట్రిక్ పాసవుతుంది. వర్ధని తల్లి మాణిక్యమ్మగారు మరణిస్తారు. వర్ధనీ రజనీకాంత్‌లు వివాహం చేసుకోవాలనుకుంటారు. సుందరిచే మోసగించబడ్డ ఆనందరావుకి అతనంటే ఇష్టపడే రాణిగురించి చెప్తుంది వర్ధని. ప్రయివేట్‌గా చదివి ఇంటర్ పాసయిన వర్ధని వుద్యోగంలో చేరుతుంది. స్కూటర్ ప్రమాదంలో గాయపడ్తాడు రజనీకాంత్. తనకోసం వచ్చిన సుందరి చెరచబడిందని తెలుసుకుంటుంది వర్ధని. రాణిని వివాహం చేసుకుంటాడు ఆనందరావు. తను చెల్లెలులా చూసుకుంటున్న కవితను వర్ధనికి పరిచయం చేస్తాడు రజనీకాంత్.




# రాగవీచికలు

మారి. తక్కువకట్నం యిచ్చి పెళ్ళి చేశాడామెకు. చిన్నల్లుడు బీదవాడైనా గుణవంతుడని ఆయన అభిప్రాయం. అందుకే కలిగినకాడికి చిన్నకూతురి అచ్చటా ముచ్చటా తీర్చేవాడు.

మాణిక్యమ్మ పోయాక పిల్లలు కూడ పట్నం వెళ్ళిపోయాక చిన్నకూతురు రాజేశ్వరి కాయింట్లో స్వతంత్ర మెక్కువయింది. తండ్రిమాటను అన్నలు కాదనలేరని ఆమెకు తెల్సు అందుకనే ఓ నెల్లాళ్ళు తల్లిదండ్రుల సేవ చేసినట్లు చేసి తనపని తాను సాధించుకుంది.

ఇచ్చేటప్పుడు బాధనిపించలేదు మాధవరావుగార్కి. తర్వాత చిన్నల్లుడు తను పెట్టుబడికింద యిచ్చిన అయిదు వేలూ ఆర్పేసి రాజేశ్వరిని పసుపుకొమ్ముతో నిలబెట్టినపుడు అతనికి దుఃఖం ఆగలేదు.

అప్పుడాయనకు పోయిన పెద్ద కూతురు గుర్తొచ్చింది. స్వతంత్రులుగా జీవించే ఆమె పిల్లలు గుర్తొచ్చారు.

అంతడబ్బూ పెట్టుబడి పెట్టినా మళ్ళీ ఏమీ ముట్టచెప్పలేదని కూతురూ అల్లుడూ దెబ్బలాడి వెళ్లిపోయారు.

డబ్బులేనివారనీ ఎందుకూ పనికిరానిదురదృష్టవంతులనీ తనునుండి తను దూరం చేసుకున్న మనమలే తన పెద్దరికాన్ని నిలబెట్టారు. తన గౌరవాన్ని కాపాడి తనకళ్లను తెరిపించారు అందుకే 'తాతయ్యా యిదీ సంగతి. మీ ఆశీర్వచనాలు మాకు కావాలి.' అని ప్రసాద్ అన్నపుడు మరో మాట మాట్లాడకుండా 'శుభం' అన్నాడాయన.

ముహూర్తం, నిశ్చయమైంది అదే ముహూర్తానికి రెండు పెళ్ళిళ్ళూ జరగాలని రాజశేఖరంగారి అభిప్రాయం వ్యక్తపరచారు. ఆ హడావుడిలోనే తిరుగుతున్నాడు ప్రసాద్. వర్ధని మనసు యిప్పుడే కాస్త స్థిమితపడుతోంది.

ఓ రోజు సాయంత్రం ఆనందరావు హడావుడిగా వచ్చాడు. చెప్పాలనుకున్నది ఎలా చెప్పడమో అతని కర్థం కాలేదు కాఫీ తాగాక తనకు ట్రాన్స్ఫర్ రావడం ఖాయమేనని అయితే దానికింకా మరో నాలుగైదు నెలలైనా పట్టవచ్చునని చెబుతూ అసలు విషయాని కొచ్చి—

# రాగ వీచికలు

"ఈమధ్య సుందరి కన్పించింది" అన్నాడు

"ఎక్కడ?... అంది వర్ధని ఆత్రంగా.

"మామూలుగా కాదు— ఆత్మహత్య చేసుకోబోతూ"

"యేమిటి మీరనేది ?"

"అవును. నా పెళ్లికి ముందు జరిగిన సంగతే యిది. ఓ రోజు సముద్రపుఒడ్డున కూర్చుని వున్నాను. చీకటి పడేవేళ ఓ స్త్రీ ఆకారం నీటివైపు వెళ్ళడం గమనించాను. నేను భయపడ్డదే జరిగి వుండేది. ఆమెను చూస్తే అసలు సుందరికాదేమో ననిపించింది. నేనెవరో తెలియక నాలో మొదట సెగు లాడి నాముఖం చూశాక వెక్కివెక్కి ఏడ్చింది. ఆమె పరిస్థితి అర్థంకాడానికి లప్పేసేపు పట్టలేదు నాకు ఆ సుందరి కాదీ సుందరి అన్పించిందామె కథవింటే. ఎటూ తోచని సమ యంలో ఆమెకు ధైర్యం చెప్పి తీసుకు వచ్చాను."

"ఇప్పుడెక్కడున్నా రామె ?"

"గాజువాకలో — అక్కడే వో చిన్నకంపెనీలో టెంపరరీ టైపిస్టుగా పనిచేస్తూ వంటరిగా వుంటోంది."

వర్ధని మనసులో సుందరి చోటు చేసుకుంది. సరిగా వ్యక్తిత్వం ఏర్పడని సమ యంలో ఆకతాయిగా ప్రవర్తించి కోరికలను కొండంతలు చేసుకుని, చివరికి తనుకన్న బంగారు కలలను బూడిదపాలు చేస్తుకుంది.

"ఆమెను నే నోసారి కల్సుకోవచ్చా ?"

వర్ధని ముఖంలోకి వింతగా చూసి

"చూడు వర్ధనీ జారిపడినా స్త్రీ కాబట్టి ఆమెను చేరదీసే ధైర్యం లేకపోయిందినాకు— ఈవిషయం ఎవరితో చెబితే ఎలాంటి అర్థాలు తీస్తారోనని కడుపులో పెట్టుకుని వూరు కున్నాను— నీకు తెలియందేముంది ?"

"నేను వెళ్లి ఆమెకు చేసేదేం లేదు. వివాహంపట్ల ఆమెకున్న అభిప్రాయాన్ని తెల్సుకుందామని..."

"యేమిటి వర్ధనీ నువ్వనేది"

"ఆమెకిస్థితిలో అండగా ఓ మనిషి అవసరం—"

"నిజమేకానీ యిప్పుడామెను చేసుకునే దెవరు ?"

"ఆమెకా స్థితిని కల్పించినతనే" అని, ఆనందరావుకి అసలు విషయాన్ని తెలియ పరచింది – వారం తిరగకముందే సుందరి గిరిల పెళ్ళి నిరాడంబరంగా జరిగిపోయింది.

## 24

సాయం సమయం–సముద్రపుగాలి చల్లగా ఆత్మీయుడిలా అదర్నీ పలుకరించి ఆనందింప చేస్తూంది.

రాజశేఖరంగారు దగ్గరుండి పెళ్ళిపందిర యేర్పాట్లు చేస్తున్నారు.

ముందు గదిలో మాధవరావుగారు పెద్ద కొడుకుతో మాట్లాడుతున్నారు. మహలక్ష్మ మ్మగారు కోడళ్ళదగ్గిర వంటింట్లో కూర్చుని ఆకాలంనాటి పెళ్ళి సంగతులు ముచ్చ టిస్తున్నారు

ఆసమయంలో ఆయింటిముందో కారు ఆగింది. అందులోనుండి వర్ధని, ప్రసాద్, దిగారు. వారితోపాటు దిగిన వ్యక్తిని పలుక రించి సాదరంగా లోనికాహ్వానించారు రాజశేఖరంగారు.

మాధవరావుగారు మాత్రం ఆశ్చర్య పోయారు. పొందూరు ఖద్దరుపంచ, లాల్చీ, వుత్తరీయం– అతనిచూట్టూ అతని పిల్లలు.

"నువ్వా రంగారావ్-కూర్చో" మాధవ రావుగారి కంఠం వణికింది – సంతోషం; దుఃఖం అన్నీ అతని గొంతులో పలికాయి.

"నన్ను క్షమించండి మామయ్యా — బిడ్డలకు తండ్రినై బ్రతికుండీ కూడ దూర మయ్యాను — తండ్రి తర్వాత తండ్రిగా, తల్లి తర్వాత తల్లిగా వాళ్లని ఆదరించి యింతవారిని చేశారు. మీ రుణం తీర్చుకో లేనిది" రంగారావు గొంతు పశ్చాత్తాపంతో పూడుకుపోయింది.

"నువ్వనుకున్నంత మంచి నాలో లేదయ్యా — వాళ్ల మంచితనమే వాళ్ల బ్రతుకులను సరిదిద్దింది. తాతగారి సొమ్మును హక్కుగా నైనా అనుభవించలేదు వాళ్లు — వాళ్లిప్పుడు సర్వస్వతంత్రులు. అటువంటి వారికి తండ్రి వైన నీవు అదృష్టవంతుడవు – దురదృష్ట వంతుడను నేనే..."

మాధవరావుగారి కళ్లలో నీళ్లు తిరిగాయి.

ఆ క్షణంలో తల్లి గుర్తొచ్చి వర్ధని కళ్ళు తడిశాయి. లోపల నుండి వచ్చిన మహలక్ష్మ

గోద్రెజ్ నుంచి

# క్రొత్త టర్కిష్ బాత్




## ఒక ఉన్నతమైన సబ్బు నమ్మలేని ధరలో కేవలం

# Rs. 1·10 (పన్నులు అదనం)

గోద్రెజ్ వారు మాత్రమే మీకు అంత తక్కువ ధరలో ఎక్కువ నురుగు నిచ్చే...ఎక్కువ నిలువ ఉండే...తాజాదనము నిచ్చే సువాసనతో ఉండే సబ్బును అంద చేయగలరు.

## గోద్రెజ్ వారి టర్కిష్ బాత్

Interpub/GTB/1/75/TEL

# రా గ వీ చి క లు

మ్మగారు అల్లుణ్ణి గుర్తుపట్టి కంటనీరు పెట్టుకుంది.

కాఫీలయ్యాయి — అందరి మనసుల్లోనూ ప్రశాంతత తొణికిసలాడింది.

'పిలిచి వుద్యోగమిస్తే ఎవరబ్బా యీ మహాత్ముడనుకున్నా — చెప్పలేదేం నాన్నా'' అన్నాడు వాను తండ్రి దగ్గరకు చేరి.

''అంత గొప్పగా చెప్పుకునే నాన్న కాడు నాన్నా యీ నాన్న'' అన్నాడు రంగారావు కొడుకును దగ్గరకు చేర్చుకుంటూ.

ఈమాటు అందరూ ఆశ్చర్యపోయారు.

## 25

జగమంతా వెండి కవచం తొడిగినట్లు వెన్నెల విరజమ్ముతోంది. నిండు పౌర్ణిమ నూతన దంపతుల హృదయాలలో వెల్లువ లాంటి కోర్కెలా వెన్నెలలో తడిసి ముద్దవుతున్నాయి.

''ఎడారివంటి నా జీవితంలో వేయి వెన్నెల వసంతాలను చిందించావు ఈ వెన్నెల, యీ మల్లెలు కలిసి యివ్వలేని చల్లదనం నా రాణి యివ్వాలి అంటూ వర్ధనిని కౌగిలిలో చేర్చుకున్నాడు రజనీకాంత్. వర్ధని మనసు ఆనంద పారవశ్యంతో పొంగులాడిపోతూంది.

''ఈ శుభ ఘడియ గూర్చి ఎన్ని కలలు కన్నానో తెలుసా'' నెమ్మదిగా చెవిలో చెప్పినట్లున్నాయా మాటలు.

''అవునవును. నీవి కలలుగనే కళ్ళుమరి!'' ఆమెను గుండెల కదుముకుని వాలినరెప్పలపై ముద్దిడుకున్నాడు.

''మీవి మాత్రం?'' తనకోసం తెరిచిన స్వర్గ ద్వారాలలో కాలూనబోతూ మంద్ర స్థాయిలో అంది వర్ధని.

బయట వెన్నెల, మంచు లోకాన్ని ముంచెత్తుతూనే వున్నాయి.

కడలివంటి మానవ జీవితంలో ఎన్నెన్నో రాగవీచికలు ఎగిరి పడుతూనే వున్నాయి.

(అయిపోయింది)

అం కి త ం

నాన్నగారు కీ. శే ఆదూరి పే రాజు గారికి హృదయపూర్వకంగా రా బాబు.

కృతజ్ఞతలు: నా యీ సీరియల్ నవలకు 'రాగవీచికలు' అనే పేరును సూచించిన నా శ్రీమతి ఆదూరి సత్యవతీదేవికి—



# హైదరాబాద్ నోట్‌బుక్

( 6వ పేజీ తరువాయి )

అధికారా? లేక ప్రజాసేవాపరాయణుడా? అనిపిస్తుంది. ప్రతిరోగికీ సహాయిస్తారు. డిస్చార్జ అయినవారు వూరికి వెళ్లడానికి డబ్బులులేవంటే, సహాయం చేస్తారు. నిజమైన రక్షణాధికారి. అనకాపల్లిలో పుట్టారు. మెట్రిక్యులేషన్ చదువుతుండగా, చదువుమాని, 18వ ఏట 1951లో మద్రాసులో పోలీసుశాఖలో చేశారు. తర్వాత హైదరాబాద్ స్పెషల్ బ్రాంచి పోలీసుశాఖలోను చేశారు. 1967లో సెంట్రల్ రిజర్వు పోలీసు శాఖకు వారి ఉద్యోగం మారింది. వివిధ రాష్ట్రాలలో శాంతి భద్రతలు కాపాడే పని చేశారు. 1973 నుంచి హైదరాబాద్‌లో ఉన్నారు న్యాయబుద్ధి, ధర్మచింత, సేవానిరతి, ఆయన మాటలలో, చేతలలో అనుక్షణం ముందుకు తోసుకొని వస్తుంటాయి. ఎందరికి మంచి సలహాలు! ఎంతమందికి చదువులు! ఎంతమందికి పొదుపుపై ఉపదేశాలు! ఇలాటి పోలీసు ఆఫీసర్లు పట్టుమని పదిమంది వుంటే, ఏ రంగంలోను అవినీతి మొలకెత్తదని నా విశ్వాసం. శ్రీ వీరభద్రరావు జీవితం ధన్యమని, ఆయన ఏ యోగికీ, ఏ భక్తునికీ, ఏ ప్రజా సేవకునికీ, వైష్ణవ పరిబాషలో ఏ పరమభాగవతునికీ తీసిపోరని నా సంపూర్ణ విశ్వాసం. ఆయన ఇంకా ఇప్పుడే నాలుగుపదులుదాటారు. ఇంకా నాలుగుపదులు వుంటూ సేవచేస్తారు.

### శత రుద్ర యాగం

గుల్‌జార్ హవుస్ ప్రాంతంలోని పంజెషాలో మహాయోగి పుంగవులు శ్రీ ఉపేంద్రశుక్ల మహరాజ్ విశ్వశాంతి కోసం వందమంది ఋత్విక్కులతోజరుపుతున్న శతరుద్ర యాగం పూర్ణాహుతి సెప్టెంబరు 5వ తేదీన వైభవోపేతంగా జరిగింది. దేశంలోని వివిధ ప్రాంతాల నుంచి పలువురు విద్వాంసులు, సన్యాసులు ఈ యాగంలో పాల్గొన్నారు. శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, శ్రీ ఖండవల్లి నరసింహశాస్త్రి, ఉపేంద్రమహరాజ్, హృషికేశ యతీంద్రులు యాగ వైశిష్ట్యాన్ని గురించి ఉపన్యసించారు. ఋత్విక్ సన్మానము, గోపూజ వందలాది బీదలకు అన్నదానం జరిగాయి. బస్తాబియ్యం అన్నంతో చేసిన మహాలింగానికి పూజ జరపడం యాగంలో విశేషం.

### ఉపశ్రుతి:

"ఏమిటిసార్! ఈ కవులు తమకు వచ్చిన బిరుదులు అకస్మాత్తుగా వచ్చాయని చెప్పుకుంటారు. బిరుదాలు ఇచ్చే ముందు ప్రభుత్వమూ, విశ్వవిద్యాలయాలు ఆరునెలల ముందుగానే వారినుంచి విషయాలు సేకరిస్తుందిగదా! బహిరంగ సభలో ఈ నాటకాలెందుకు?" అని అడిగారు ఒక శ్రోత మహాశయులు నన్ను. నేను ఏమనను! "[illegible], అదీ ఒక కల్పన, ఒకభావుకతా!" అన్నాను.

"శ్యామలా—"

అసహనం-అతిశయంతో అరుస్తున్నట్టుంటే-సిస్టర్ శ్యామల చేస్తున్న పని ఆపి-హడావుడిగా-డాక్టర్ రమ దగ్గరకొచ్చి అర్థంకానట్టు చూస్తూ వుండిపోయింది.

రమ కళ్ళు గుమ్మందగ్గర నిలబడ్డ ఒక బీద ఆకారంమీద కేంద్రీకరించి వున్నట్టు ఆ కళ్ళు నిండుగా అసహ్యాన్ని పులుముకున్నట్టు గ్రహించిన శ్యామల, ఏదో చెప్పాలనుకుని-ఎలా చెప్పాలో తెలియక తికమక పడుతోంది.

"వాళ్ళకేం మతిలేదా, ఎన్నిసార్లు చెప్పాలి? పాపంకదా అని అడ్మిట్‌చేసే — నన్ను పీడలా పట్టుకున్నారు. అంత గతిలేని వాళ్ళు గవర్నమెంట్ హాస్పిటల్లోనే అఘోరించకూడదూ -!"

మొహం చెండుకుంటూ, వెళ్ళబోతున్న డాక్టర్ రమ కాళ్ళను-

ఎండిపోయిన తీగెలా చుట్టుకుందా ఆకారం.

"ఛా...ఏమిటీ న్యూసెన్స్!"

కట్టుకున్న బనారస్‌చీరె విలువ తరిగిపోతుందేమో నన్నంత బెంగగా — పట్టుకున్న చీర వొదలదేమో నన్నంత భయంగా-విదిలించి కొట్టినా — బక్కచిక్కిన వానపాము లాంటి ఆ ఆకారం — తన బలాన్నంతా ధారపోసినట్టు పట్టును సడలనివ్వడం లేదు.

"సిస్టర్...మన కేమిటీ తలకాయనొప్పి"

కోపంగా జేవురించిన మొహంతో నిలబడ్డ డాక్టర్ రమవంక సూటిగా చూడలేకపోయింది నర్సు.

ఐనా డాక్టర్ మర్చిపోయిన కర్తవ్యాన్ని-కోసం గుర్తుచేసైనా పాపాన్ని తగ్గించుకుందామన్న పాపభీతితో నెమ్మదిగా తలెత్తింది.

"మేడమ్ ... వీళ్ళమ్మాయి కండిషన్ అంత బావుళ్ళేదు ... ఇప్పటిదాకా అక్కడే వుండి వచ్చాను ... నొప్పులు రావటంకూడ ఆగిపోయినట్టున్నాయి — ఇంకా ఆలస్యమైతే ...!" "మేడమ్ ... మీరు ప్రిపేర్ చెయ్యమంటే — సిజేరియన్‌కి...!"

భయం భయంగా అంటున్నా...ఇక జరగబోయే కాండలో తనపాత్ర లేనట్టు ... ఏది ఏమైనా దాని తాలూకు పాపం ఇక ఏమాత్రం తనకు అంటనట్టు అన్పించి ఆ ఎముకల గూడువంక..., తగినంత డబ్బు రాల్చలేని..., దానిని కప్పుతున్న పొట్టురేగే చర్మంవంకా— ఒక్కసారి చూసి కళ్ళుదించుకుంది సిస్టర్.

"తల్లీ ... డాక్టరమ్మ తల్లీ ... ఈ చ్చనాన్నుంచీ ... నువ్వే దాని కన్నతల్లివి ... పేనాలుపోసే అమ్మోరివి ... దాని పేనాలు నీ సల్లని చేతుల్లోనే వుండాయి తల్లీ... లచ్చిమి...మా పల్లెలో దీపం తల్లీ ... నిన్ను నమ్మకు వచ్చినాం...బిడ్డకు వచ్చే పేనం... పోయే పేనంనాగుంది... దాన్ని గట్టెక్కించు తల్లీ... నాకీ చ్చనంలో ఎవ్వరూ నేరు... నువ్వే దాని ఆయుస్సువి... నువ్వే దానికి పేనం పోయాల తల్లీ...!"



# చేను మేసిన కంచె

డాక్టర్ కె.వి. కృష్ణకుమారి

తిండి తిని ఎన్నో రోజులైన ఆ పేదరాలి ఏడుపు విషాద సంగీతంలా చెవులకు తగులుతున్నా చలించక— మాతృత్వపు మమకారం పొంగుతున్నా... కన్నీటికి కూడా నోచుకోని దిగుడుబావుల్లాంటి... కాంతిలేని ఆ గాజు కళ్లలో గుండెలను పిండేసే ఆర్ద్రత. వెల్లువలా పైకుబుకుతున్నా చెక్కు చెదరక ప్రాణాపాయంలో వున్న కన్న కూతురు అమూల్య ప్రాణాలకి తగినంత మూల్యం చెల్లించుకోలేని నిస్సహాయతకు ఎక్కిళ్ళు పెడుతున్న ఒక నిరుపేదను-పేదగా చూసి ఒక్కసారిగా విదిలించుకుంది డాక్టర్.

చిరాగ్గా టైము చూసుకున్న రమ కనుబొమ్మలు సాలోచనగా ఒక్కక్షణం దగ్గరకొచ్చి మరుక్షణంలోనే సౌమ్యంగా నొసటిని పలకరించాయి.

"సిస్టర్.. కంట్రాక్టర్ గారమ్మాయికి నొప్పులొస్తున్నాయంటే చూసి రమ్మన్నాను కదూ!"

ఖరీదైన దర్పం సర్పంలా పడగ విప్పిన ...ంది.

'అవును మేడమ్... వాళ్ళింటికి వెళ్ళొచ్చాను... వాళ్ళనవసరంగా కంగారు పడుతున్నారుగానీ... జనరల్ కండిషన్... బిడ్డ పొజిషన్ అంతా నార్మలు. ఇక్కడికి రాకపోయినా ఇంట్లోనే ఈజీగా డెలివరీ అవుతుంది...!"

ఉత్సాహంతో చెప్పబోతున్న శ్యామలని చూపులతోనే కాటేసింది డాక్టర్ రమ

కంట్రాక్టర్ ఎయిర్ కండిషన్డ్ యిల్లూ ఇంపాలాకారూ—జేబుల్లోంచి ఎత్తుగా తొంగి

చూసే చెక్‌బుక్స్ — ఏ క్షణాన్నైనా పగల టానికి సిద్ధంగా వున్న పండిన దానిమ్మకాయ లాంటి మనీపర్స్ — లక్షలు తప్ప 'వే లు' మాటల్లో కూడా దొరకని వాళ్ళ స్టేటస్.

ఒక్కసారి రమ కళ్ళలో టెక్నికలర్ రీల్స్‌లా తిరిగాయి. సిస్టర్ మాటలు చెవుల్లో గింగురు మంటూ- మస్తిష్కంలో అలజడి రేపుతున్న ట్లనిపించి—మళ్ళా కస్సుమంది.

"సిస్టర్ నీకు అనుభవం తక్కువ. నీకేదో పెద్ద తెలుసని వాళ్ళింటికి పంపించలేదు. నా తరఫున రెగ్యులర్ అటెండెన్స్ వుండాలన్న ఉద్దేశ్యంతో పంపానుగానీ తెలిసీ తెలియకా నోటికొచ్చిందల్లా మాట్లాడమని కాదు. ఇంకొకసారి ఇలా బిహేవ్ చేశావంటే బి కేర్ ఫుల్"

కఠినంగా శాసిస్తూ—హడావుడిగా ఫోన్ డయల్ చేసిన రమమొహం—అవతలి కంఠం వినటంతోనే పద్మంలా విచ్చుకుంది.

"నొప్పులు అలాగే వస్తున్నాయా... ఏమిటీ నడుం నొప్పి విపరీతంగా వుందా... అరెరే- ఉమ్మనీరింకాపోలేదుకదూ—భయమా- భయమంటే-తప్పదుమరి. ఓ - డోంట్‌వర్రీ— అలా ఎందుకన్నానంటారా—ఎంతైనా మొదటి కాన్పుకదా— అందులో అమ్మాయి భయస్తురాలు. అన్నిటికన్నా ముఖ్యం... చెప్పారుకదా- లోపల బిడ్డ పొజిషన్...నార్మల్‌గ లేదు.

అయ్యో ! మీరే అలా భయపడితే ఎలా— నాకు తెలీదా సుజాతంటే మీకెంత ప్రాణమో... అందుకనే చెపుతున్నాను గదా. అర్జంట్‌గా ఇక్కడికితీసుకువచ్చెయ్యండి...గాబరాపడకండి. అన్నిటికీ నేనున్నానుకదా — లోపల పిండాన్ని సరిగ్గా తిప్పే-సాధ్యమైనంతవరకూ కుట్లు పడకుండా చూస్తాను.

భలేవారే మీరు...అన్నిసార్లు చెప్పాలా- మీరు...అందులో మీరు...నా శ్రమని వుంచుకుంటారని నేననుకుంటానా—

ఓ కే ధైర్యంగా తీసుకురండి—!"

తన సర్వస్వమూ సుజాతే ఐనట్టు— ఆత్మీయతనంతా పెదాల్లోనే కురిపిస్తున్న డాక్టర్ రమవంక గుడ్లప్పగించి శిలా విగ్రహంలా చూస్తూ వుండిపోయింది శ్యామల.

ఫోన్ పెట్టేసి ఆనందంగా గాలి పీల్చుకుంటున్న డాక్టర్ కళ్ళలోని ధనదాహం డబ్బు కోసం ఏ పనైనా చెయ్యగల వెన్నెముకలేని జాతిలక్షణం—క్రొత్తగా వచ్చిన సిస్టర్‌కి సరి క్రొత్తగా కన్పిస్తున్నాయి.

"అదేమిటి? అలా బెల్లంకొట్టిన రాయి లాగా నిలబడ్డావ్. కొద్దిసేపట్లో కంట్రాక్టర్ గారమ్మాయిని తీసుకువస్తారు. ఫార్సెప్స్ సామాను (బిడ్డను బైటకిలాగే ఆయుధాలు), ఎపిసియాటమీ ఇన్‌స్ట్రుమెంట్స్ (బిడ బైటకివచ్చేద్వారం ఇరుకైనప్పుడు కాన్పుకి అనువుగా చేసే చిన్న ఆపరేషన్‌కి కావల్సిన సామాన్లు). రెడీ చెయ్యి!"

హడావుడిగా ఒక అడుగు ముందుకు వేసిన రమకు చెప్పుల్లో రాయిలా తగిలింది ఇందాకటి ఆకారం.

కంట్రాక్టర్‌గారి అమ్మాయికోసం ప్రాణాలైనా ఇవ్వటానికి సిద్ధంగావున్న డాక్టరమ్మ ఏమనుకుందో.

"సిస్టర్ పద వీళ్ళమ్మాయిని ఒక్కసారి చూసొద్దాం!" ఎంతో తపస్సు చేశాక వచ్చి వరాలిచ్చిపోయే దేవతకి దారి చూపుతున్నట్లు సంబరపడిపోతూ వొంగిపోయి నడుస్తున్న ఆ బక్కచిక్కిన ఆకారం సరసన దర్జాగా నడుస్తూ ఒక రూమ్‌లోకి అడుగుపెట్టింది డాక్టర్.

ఉదరవ్యాధితో బాధపడుతూ దిక్కులేక నడివీధిలో గాలిని మింగుతూ సొమ్మసిల్లి పడిపోయిన బక్కచిక్కిన కుక్కలాంటి ఒక స్త్రీ ఆకారాన్ని నిర్వికారంగా చూస్తూ చెయ్యి అందుకుని వదిలేసింది.

చిల్లిగవ్వకూడా గతిలేని ఖాళీ కుండలా టప్పన శబ్దం చేసిందది.

గంజికూడా నోచుకోని బోర్లేసిన కుండ లాంటి పొట్టమీద సుతారంగా నొక్కుతూ తప్పనిసరిగా పరీక్షలు చేసిన డాక్టర్.

ఎంతో చేసి అలసిపోయినట్టూ ఆ రెండు నిముషాలూ నిష్ఫలమైనట్టూ తల వదిలించుకుంది.

కేస్ కండిషన్ తెల్సు కనుక ఏ క్షణంలో డాక్టరమ్మగారు 'సిజేరియన్'కి తయారవమని చెపుతారోనని అదురుతున్న గుండెల్ని అరచేతిలో పెట్టుకుని కొంపలు మునిగిపోతున్నట్టు నిలబడ్డ సిస్టర్‌వంక.

అజ్ఞానిని మహాజ్ఞాని చూసినట్టు చూసింది డాక్టర్.

అంతరార్థం అర్థంకాని సిస్టర్— పెదాలు తడుపుకుంటూ మెల్లగా గొణిగింది.

"ఐతే మేడమ్... ఇమీడియట్‌గా...!"

డాక్టర్ రమ కళ్ళలోని పదును చెర్రున సిస్టర్ నాలుకను కోసినట్లైంది.

"అంటే బాధపడతారు మళ్ళా, ఇన్నాళ్ళు గాలికొదిలేసి ఆఖరి క్షణంలో తీసుకు వస్తారు డాక్టర్ దగ్గరకి. ఏమాత్రం అటూ ఇటైనా డాక్టర్‌మీద పడి ఏడవటానికి"

తాపీగా, లెచ్చిపెట్టుకున్న కోపంతో అంటున్న డాక్టరమ్మ మాటలు వింటుంటే ఆ పిల్ల తల్లి గుండెను బలంగా పట్కారుతో నొక్కేసినట్టైన, ముచ్చెమటలూ పోసి కూలబడింది.

"ఆలస్యం లేదమ్మా, సన్న నొప్పులు ఆరంబం కాగానే అటుకొచ్చేశాం. మరీ నిన్నటికాడ్నుంచే పేనం...!" కీచుగా ఏడుస్తున్న ఆ తల్లివంక, క్షణం చూసిన రమ చిరాకుగా మొహం చిట్లించింది.

"అదే వద్దంది తీరా నొప్పులు మొదలయ్యాకనా తీసుకువచ్చేది. మొదటి కాన్పు కదా. అందులో చిన్న పిల్ల. ఇంతబలహీనంగా వుంది కదా. ఒక పదిరోజులు ముందుగానే



# చేసువేసిన కంచె

పరీక్షలకైనా తీసుకురారూ. పరిస్థితులు చేతులు దాటాక ఉత్త చేతుల్తో, హాస్పిటల్‌లోకి రావటం. మా ప్రాణాలు తియ్యటం. ఇదేమన్నా గవర్నమెంట్ హాస్పిటల్ అనుకున్నారా. గవర్నమెంట్ సొమ్ములో తేరగా మందులిచ్చి– గవర్నమెంట్ హాస్పిటల్‌లోనే కానీ ఖర్చులేకుండా, నర్సింగ్‌హోమ్స్ రన్ చేసుకోటానికి ఇప్పుడు వాళ్ళే డబ్బెక్కడ పెడితేగానీ, కత్తి పట్టడంలేదు...!"

రమ మాటలు పూర్తవకుండ నే ఘొల్లుమందా తల్లి. "అందుకనే తల్లీ – బిడ్డనీడకి తీసక వచ్చేశాం, గవర్మెంటోల్లు డబ్బిత్తేనే సేత్తారంటే - ఈడ సేసేకైనా డబ్బివ్వచ్చని, పేనం నిలుత్తుందనీ, వచ్చేశాం! తవరు అడిగినంతా తెత్తానని, దాని అయ్య ఎల్లి, రెండుదినాలై పోనాయి...డబ్బిచ్చే ఆసామి ... దొరికిండో – నేదో ... ఈలోగా పిల్లదాని పేనం... !"

గోలగోలగా ఏడుస్తూ – తననే మృత్యువు కబళించబోతోం దన్నంత భయంకరంగా వొణికిపోతున్న ఆతల్లిని–

అలవాటైన అనుభవంతో నిర్భయంగా చూసింది రమ.

"పిల్ల ప్రాణానికేం నష్టంలేదు. కానీ ఆపరేషన్ మధ్యలో అవసరమైన మందులు కొనాలన్నా డబ్బు కావాలికదా. చెప్పానుకదా– ఇది గవర్నమెంట్ హాస్పిటల్ కాదని–!"

ఆపరేషన్ టైమ్‌లో – హాస్పిటల్లో లేని– అవసరమైన మందులేమిటో అర్థంకాలేదు సిస్టర్‌కి –

నిరుపేదలకోసం నిరుపయోగంగా రెండు గంటలు పడే శ్రమ– ధనికులకు అందజేస్తే తద్వారా పెరిగే విలువలను గురించి–

ప్రాణాన్ని మించిన విలువ ధనానికుంటుందన్న నగ్నసత్యాన్ని గురించీ– కూలంకషంగా తెల్సుకోవాలంటే సర్వీసు తక్కువైన సిస్టర్‌కి చాలా కాలం పట్టవచ్చు.

ఐనా అర్థం చేసుకోటానికి ప్రయత్నిస్తూ డాక్టర్ని అనుసరించింది.

"మేడమ్...!"

సిస్టర్ గొంతులో అపశ్రుతులు పలికాయి.

"... ... ... ..."

"పాపం వాళ్లంత డబ్బు తెచ్చుకోలేరేమోనండీ... వాళ్ళ అవతారాలు చూస్తుంటే..."

విరబడిన రమ మొహం చూస్తూనే, టక్కన నోరు మూసుకుంది.

"అందుకని... అందుకని...!"

రెట్టిస్తున్న రమ వంక నిస్సహాయంగా చూస్తూ, తప్పదన్నట్టు పెదాలు కదలించింది.

"ముందరగా మనం ఆపరేషన్ చేస్తే, ఆ తరువాత అతను ఎలాగా డబ్బు తెస్తాడు కనుక...!"

సిస్టర్ మాటలు పూర్తవకుండానే. విరగబడి నవ్వింది రమ.

ఇంకా ఇంకా నవ్వుతున్న రమవంకే తెల్లబోయి చూస్తోంది సిస్టర్.

నవ్వటం ఆపిన డాక్టర్, సిస్టర్ వంక జ్ఞానిలా చూసింది.

"చూడు శ్యామలా, డబ్బుకోసం గడ్డితినే మార్గాలెన్ని వున్నాయో, మనుషుల్ని మోసం చేసే మార్గాలూ అన్నే వున్నాయి ఈ రోజుల్లో అవతారాలను బట్టి, వాళ్ళు ధనవంతులో లేదో, అంచనా వెయ్యటం, అంత తేలికను కుంటున్నావా? కానే కాదు. మాసిన గడ్డంతో మకిలి పట్టిన గుడ్డల్తో తిరిగేవాడు దరిద్రుడని చెప్పగలవా? అలాగే సిల్కు చొక్కాకి కునేగా పులుముకుని తిరిగేవాడు లక్షాధికారి అనుకోవచ్చా లేదు చూడు శ్యామలా అన్ని వ్యాపారాల్లాగే మనదీ ఒక వ్యాపారం. ఏ వ్యాపారంలోనైనా నిర్దాక్షిణ్యంగా, నిర్మొహమాటంగా ప్రవర్తించినవాడే పదికాలాలపాటు పచ్చగా బ్రతుకుతాడు.

అవసరమనేది మనిషిచేత ఎంతపనైనా చేయిస్తుంది శ్యామలా. పసుపులాడు వేసుకున్న వాళ్ల చేతుల్లోనే పచ్చనోట్లు పుట్టిస్తుంది. కడుపంటుకుపోయినవాడైనా సరే మరొకడి కడుపుకొట్టి మరీ తెస్తాడు డబ్బు. మనం ఉదారంగా ప్రవర్తించామని మరొక డాక్టరైతే డబ్బు పిండకుండా వూరికే చేస్తారనుకున్నావా ? నెవ్వర్. చూస్తూ వుండు. దాని బాబుకాదు. వాడి తల్లో జేజెమ్మ తెస్తుంది డబ్బు!"

గిర్రున తిరుగుతున్న ఫాన్‌వంక విలాసంగా చూస్తున్న డాక్టర్‌ని చూస్తుంటే. '.

సిస్టర్‌కి కళ్లు తిరుగుతున్నట్టనిపించింది.

"అది సరే మేడమ్...మరి పేషంట్ కండిషన్నిబట్టి కూడా...మనం...!"

డాక్టర్ నవ్వు మంచు తెరలా కొట్టింది.

"పిచ్చిదానా, కండిషన్‌బట్టి, సొంతడబ్బులు

పెట్టుకోటానికిమనమేమన్నాలక్షాధికార్లమా? తీరా మనమింతా కష్టపడ్డాక వాళ్లు మొండి చెయ్యి చూపిస్తే, ఆ తరువాత మనం డబ్బు రాబట్టుకోగలమా? పోనీ ఈ ఒక్క కేసే కదా అని దయ తలిస్తే, వీటి సంఖ్యఎక్కువై పోతాయి. త్వరలోనే మనమూ దరిద్రుల మవటం ఖాయం.

అందుకనేగా, సగం తప్పు వాళ్లమీదకు నెట్టేంది'' డాక్టర్‌గా ఎవర్నీ లెక్కచెయ్యా ల్సిన అవసరం లేనంతటి స్థానాన్ని ఆక్ర మించిన రమ... నిర్లక్ష్యంగా చెపుతూనే, బహుశా కంట్రాక్టర్‌గారింటికి, అలి విన యంగా ఫోన్ చెయ్యబోతుంటే

శ్యామల కళ్లకి ఆవిడ ఆకారం, అంద మైన కాలనాగులా కళ్లు మిరుమిట్లు గొలు పుతూ. మరుక్షణంలో ఇంద్ర ధనుస్సులా రంగుల్లో కన్పిస్తోంది.

జాలి-క్షమ-మానవత్వాలను, పాపభీతిని ఇంకా డిక్షనరీలోంచి కొట్టేసుకునేటంతగా లోకాన్ని చదవని సిస్టర్ స్తబ్దుగా వుండి పోయింది.

అట్టహాసంగా, ఫెళఫెళ లాడుతూ, డాబు దర్పాలపైన కంగారుని పులుముకుని, గోల గోలగా ఇంపాలా దిగుతున్న కంట్రాక్టర్‌గారి ఫామిలీని చూస్తూనే డాక్టర్ రమ పరుగు లాంటి నడకతో వాళ్లని జేరుకుంది.

అణువణువునా ఆప్యాయతని నింపుకుని, కళ్లనిండుగా ఆ అమ్మాయి తోడిదే లోక మన్న భావాన్ని వొంపుకుని. సుజాతని అతి జాగ్రత్తగా — లేబర్ టేబిల్ దగ్గరకి స్వయంగా నడిపించుకుని వెడుతున్న రమని అచేతనంగా అనుసరించింది సిస్టర్.

''వాటీజ్ దిస్ సిస్టర్. ఎక్కడ ఏక్టివ్‌గా వుండాలో ఎక్కడ అరేంజ్‌మెంట్స్ త్వర త్వరగా పూర్తిచెయ్యాలో ఇంకా తెలియక పోతే ఎలా? చూడు పాపం అమ్మాయి ఎలా బాధపడుతోందో క్విక్!

క్రొత్తగా అప్పాయింటైందండీ ఈ సిస్టర్...ఇంకా నా దగ్గర ట్రైనింగవలేదు.''

గంగిరెద్దులా నగలు దిగేసుకున్న కంట్రా క్టర్‌గారి భార్యతో డాక్టర్‌గారు ఆప్యాయంగా అనటం లీలగా విన్పించి నవ్వుకుంది సిస్టర్.

'అవునవును...ఈ రకం ప్రాక్టీస్‌కి మీ దగ్గర ట్రైనింగ్ చాలా అవాలి' గొణుక్కుం టూనే ఫార్సెప్స్, కావల్సిన సామాను చెకా చెకా పెట్టి మౌనంగా డాక్టరుగారి ప్రక్కన నిలబడింది.

''అమ్మా ఇక్కడ వుండటం మీకూ మంచిదికాదు. అమ్మాయికీ మంచిది కాదు. మీకు మళ్లా రక్తపోటు ఎక్కువైందంటే చాలా కష్టపడాల్సొస్తుంది. నా ప్రాణాన్ని అడ్డువేసైనాసరే మీ సుజానీ పాపనీ మీ కందించేభారం నాది ... దయచేసి బయ టుండండి!''

వారు మాట్లాడకుండా కళ్లుతుడుచు కుంటూ బైటకు వెడుతున్న కంట్రాక్టర్ గారి భార్యని గుమ్మందాకా సాగనంపి తలుపులు వేస్తున్న సిస్టర్‌కి-డబ్బుకోసం వెళ్లిన భర్త కోసం—

దానికోసంఆగిన డాక్టరమ్మ దయకోసం—

దేని కోసం ఆగని కన్నకూతురు అమూల్య మైన ప్రాణం కోసం.

గట్టుసపడ్డ చేపలా, గిలగిల లాడుతూ హృదయవిదారకంగా, ఎక్కిళ్లు పెడుతున్న 'లచ్చి తల్లి' కన్పించి చూడలేక కళ్లుమూసు కుంది.

గుండె రాయి చేసుకుని, డాక్టర్‌గారి దగ్గ రకు రాబోతున్న శ్యామలని కళ్లతోనే వద్ద న్నట్టు వారించి, కంగారు పడుతున్న డాక్టర్ని, అర్థం కానట్టు అయోమయంగా చూసింది.

మామూలుగా అయిపోయే కాన్పుకి ఇంత ముచ్చెమటలు పొయ్యటం ఎందుకో అర్థం కాలేదు సిస్టర్‌కి.

కాన్పు మామూలుగా అవుతుందనా???

ఇప్పుడిప్పుడే కాస్తకాస్త అర్థమౌతున్న ట్లన్పించింది.

''సిస్టర్. అలా చూస్తావేం, జనరల్ ఇచ్చెయ్యి, ఫోర్ సెప్స్ వేసెయ్యాలి, టైమ్ లేదు, క్విక్.'' బిడ్డ తల మెడదాకా బైటకి వచ్చినా, డాక్టర్ ఎందుకు కంగారు పడు తోందో ఇప్పు డర్థమైంది సిస్టర్‌కి

ఈ కేస్ మామూలుగా డెలివరీ అవ్వ టానికి వీల్లేదు.

అదంతే—

గబగబా పేషెంట్‌కి జనరల్ ఎనస్తీ షియా ఇచ్చేసింది. అప్పటికీకా డెలివరీ అవ కుండా ఆపిన బిడ్డని బైటకి లాగేసి, అనవస రంగా గర్భద్వారం దగ్గర క్రిందగా సరున కోసేసి, నిర్దాక్షిణ్యంగా కుట్లేస్తున్న డాక్ట రమ్మగార్ని చూస్తూ కొయ్యబారిపోయింది సిస్టర్. పాప ఏడుపు వింటూనే ధడాలున తలుపులు తెరచుకున్నాయి ఖరీదైన వాసన గదంతా కమ్ముకుంది.

ఎనస్తీషియా మత్తులో అచేతనంగా పడివున్న ముద్దుల కూతుర్ని, రక్తంలోతడిసి టేబిల్ మీద చిందరవందరగా వున్న ఆయు ధాలనూ

ఎంతో కష్టపడి, చెమటోడ్చి నిస్వార్థ తతో, కట్టుకున్న బనారస్ చీరెను కూడా లెక్కచెయ్యక అతి శ్రద్ధగా కుట్లేస్తున్న డాక్టరమ్మగారి వంకా అయోమయంగా ఆ తరువాత కృతజ్ఞతలో, చేతలు జోడిస్తున్న ఖరీదైన మనుష్యులు, డాక్టరమ్మగారి అభయ

ఇక ముందు నాతోర సినిమాకు రావటాలనుకుంటే-ఈ చీర కట్టుకు రాకూడదమ్మాయ్!



# చేనుమేసిన కంచె

హస్తం చూస్తూనే, లోకాన్ని జయించి నంతగా సంబరపడి పోయారు.

జేబులు తడుముకుంటున్న కంట్రాక్టర్ గారి వంక సంతృప్తిగా చూసి గట్టిగా ఊపిరి పీల్చుకుంది రమ.

"మీరు చాలా అదృష్టవంతులు. సరిగ్గా టైమ్‌కి తీసుకురాబట్టి, అన్నీ సక్రమంగా జరిగి, తల్లీ, బిడ్డా క్షేమంగా వున్నారు. రియల్లీ యు ఆర్ లక్కీ!"

గుండెలమీద చేతులు వేసుకు నిలబడ్డ, వాళ్ల కళ్లలోని భయాన్ని చదువుతున్న, డాక్టర్, మరింత తృప్తిగా నిట్టూర్పు విడిచింది.

*　　*　　*



చెక్ అందుకుని పర్సులో పెట్టుకో బోతున్న డాక్టర్ ఘొల్లున ఏడుపు వింటూనే అదిరిపడి బైటకి వచ్చింది.

ఈ పాపపు లోకాన్ని ఇంకేం చూస్తా వన్నట్లు తెరుచుకుని వున్న, లచ్చి కళ్లను, మూసి, తెల్లని ముసుగుతో నిలువెల్లా కప్పు తున్న సిస్టర్—

దగ్గరకు వచ్చే ధైర్యం లేనట్టు దూరంగా నిలబడి వున్న డాక్టర్ని చూట్టం ఇష్టం లేనట్టు తలదించుకుంది.

"అమ్మా...డాక్టరమ్మా నా తల్లి ఎల్లి పోయిందమ్మా. పదారేల్లు కల్లల్లో ఎట్టుకు పెంచుకున్న మా లచ్మి ...మమ్మలిని దిక్కు మాలినోల్లనుసేసి ఎల్లిపోయిందమ్మా...కానికి గతిలేనోల్లకు...కన్నకూతురిని బతికించుకునే అక్కులేదని సెప్పి...ఈ ఆస్పిటల్‌కే అరిపిత మైపోనాది తల్లీ...!"

భీకరంగా అరుస్తూ గుండెలు బాదుకుం టున్న ఆ తల్లి అప్పుడే డబ్బుతో కొండంత ఆశతో, ఇప్పుడు నిర్జీవంగా నిలబడ్డ భర్తను చూస్తూనే చావుకేక పెట్టి నిలువునా కూలి పోయింది.

చిరిగిన బనీన్లో అతి జాగ్రత్తగా దాచు కున్న రెండు పచ్చనోట్లు— అతని గుప్పెట్లో నలిగిపోయాయి.

సొమ్మసిల్లిన భార్యని పొదివి పట్టుకుని కన్న కూతురు కట్టెను భుజాన్న వేసుకుని. రమ దగ్గరగా వచ్చి ఒకే ఒక్క చూపు చూశాడు. పిడికిలి తెరిచి విలువలేని పచ్చ కాగితాలమీద ఖాండ్రించి ఉమ్మేసి నేలకేసి కొట్టి...వడివడిగా వెళ్లిపోతున్నా...

డాక్టర్ రమ అలాగే, నిలబడే వుంది.

మరొకరైతే ఆ చూపులకు భస్మమయే వారే.

కానీ.

పెరిగిన పేరు, పెంచుకుంటున్న అంతస్తులు, ఎంత ఘోరాన్నైనా చేసి నిలద్రొక్కుకోగల స్థైర్యం, ఎవరి నోటినైనా మూయించగల తాహతూ.

డాక్టర్ రమని ఏమీ చెయ్యలేదు.

చెయ్యలేవు. 

# ప్రశ్నావళి

— కె. రామలక్ష్మి

**హెచ్. వి. ఆర్. — విజయవాడ.**

ఒంటరితనంతో బాధ పడేవారికి మీ సలహా ఏమిటి?

ఒంటరితనంతో బాధ పడ్డానికి, కారణం ఏమిటి? ఎప్పుడేనా ఆలోచించారా? మనిషికీ మనిషికీ మధ్య వంతెనలు కట్టేబదులు— అడ్డు గోడలు కడుతున్నారు. . .

పొగిడితే మనిషి లొంగి పోతాడెందుకు?

పొగడ్త మరేం కాదు— తన మీద తనకున్న అభిప్రాయాన్ని బలపరచడమే. అందుకే పొగడ్తకి తబ్బిబ్బు అవుతాడు మనిషి.

ఒక్కొక్కప్పుడు గొంతు మూగబోతుందెందుకు?

మనం ఎక్కువగా ఎవరిని ప్రేమిస్తున్నామో వారితోనే ఎక్కువ మాట్లాడ్డానికి ఏమీ ఉండదు. మూగతనంతో ఒక్కొక్కప్పుడు భాష చెప్పలేని భావాలు యిమిడి పోతాయి. రావుగారూ! 'కనులు మాటలాడు భాష వేరే వున్నది లే— మనసు తెలియ చేయుట కది ఒకే సులువులే' అన్న కవి వాక్కు వినలేదా!

**డి హెచ్. జె. ఆర్. — పిఠాపురం.**

మీ జీవితం ఎలా సాగుతూంది కె. రా. గారూ

ఆశనుంచి ఆశకి రావుగారూ.

అందరితోటి సన్నిహితంగా స్నేహంగా వుండాలంటే ఎలా?

సహృదయత, సరదా— యివే మనసిత్తరులకి సన్నిహితులను చేస్తాయి.

**కె. వి. — కరీంనగరు.**

ఒక స్త్రీ పతనానికి పురుషుడే కారణం అని ఒకరు చెప్పకుండానే తెలిసిపోతుంటే ఆ స్త్రీనే ఏహ్య భావంతో చూస్తారెందుకు?

పురంధరికీ తను లోకువైతే— తనకెవరది లోకువ అని కసి. అంతే.

**ఐ. వి. ఆర్. — విశాఖపట్నం.**

మీరు ముసలితనంలో కూడా చాలా పడుచుగా ఆలోచిస్తారు— ఆశ్చర్యంగా వుంది. మీ వయస్సుకి మామూలు ఆడాళ్ళు అవ్వలై పోరారు.

నేను కాదనుకుంటున్నారా? నన్ను అవ్వవ్వ అంటుంది నా మనమరాలు. అయినా కావాలనుకున్నవారికి ముసలితనం రాదు సార్, తొలిచూపుల నాటి అందచందాలనే కళ్ళల్లో కట్టేసుకుంటారు.

**పి. ఎల్. ఎన్. ఎమ్. — ప్రొద్దుటూరు.**

మానవుడి స్వార్థం ఎదుటి వానిమీద ఎంత వరకూ ప్రయోగింపబడుతుంది?

ఎంతవరకు అన్న మాటకి అర్థం లేకుండా సాటి మానవుని మీద స్వార్థం సవారి చేస్తుందని నేటి కల్తీ, దగా, దారుణాలు నిరూపించుతున్నాయి కదా.

**డి. ఎన్. ఆర్. —సిద్దిపేట.**

ఈ ప్రపంచంలో కల్తీ లేని వేవో మీకు తెలుసా?

ఇంక కల్తీ లేనివంటూ వుంటాయనే నేను అనుకోడం లేదు.

**వి. ఎన్. — అల్లాబాదు.**

తాను శీలవంతుడు కాక పోయినా శీలవతి అయిన భార్య కావాలనుకుంటాడు. ఎందువలన?

తన భార్యే తన బిడ్డలకి తల్లి అయి వంశానికి పునాదిగా నిలుస్తుంది— అంచేత. భార్య శీలం లేనిదైతే కులం శీలం లేనిదిగా తయారవుతుంది కద!

**కె. జె. ఎస్. ఎమ్. హైద్రాబాదు.**

ఆడదాన్ని ఆడదే గౌరవించని యీ సంఘంలో ఆడదాని అదృష్టం ఏమిటి?

అందుకే కద— రా. వి. శాస్త్రిగారు కూడా 'పుణ్యం కొద్దీ పురుషుడు' అని రాశారు!

**ఎస్. యు. కె. — వెంకటాచలం.**

అక్కయ్యగారు, మీరు రాసిన నవలల్లో మొదట రాసిన నవల ఏమిటి?

అవతలి గట్టు. 1956 లో రాశాను.

**ఎస్. ఎస్. — పెద్దపలి.**

ఇంటర్ కాస్ట్ పెళ్లి పై మీ అభిప్రాయం?

ప్రభుత్వం యిచ్చే డబ్బు మీది ఆశతో కాకుండా పిల్లకీ, పిల్లాడికీ యిష్టమై చేసుకుంటే —నాకేం అభ్యంతరం లేదు.

**కె వి. వి. ఎస్. — విజయవాడ.**

మీ ఆయన మీ బాధ పడలేక కాషాయి వస్త్రాలు కట్టుకుంటున్నారు. సన్యాసుల్లో కలిసి పోతే మీగతి ఏమిటి?

బెంగపడకండి సత్యనారాయణగారూ, వారు సన్యాసుల్లో కలిస్తే— నేను వారిలోని భక్తురాలి అవతారం దాల్చకపోను (మీకింకా తెలియదు కాబోలు. కాషాయి రంగు— గురూ కలర్— ఇదే యిప్పటి ఫాషన్ కలర్!)

**జి. బి. — పుంగనూరు.**

సామాన్య మానవుని కనీసపు కోర్కెలేమిటి?

అసలు సామాన్య మానవుడంటే ఎ ? రెండు పూటలకి సరిపడ సంపాదించలే వా ? లేక అన్నీ వుండీ అనుభవించే యోగ్యత వాళ్ళా ఏ మనిషికైనా— కనీసపు కోర్కెలు రెండేరెండు. తను ఎదుటివాడికంటే ఎప్పుడూ గొప్పగా, ఆనందంగా, కీర్తి ప్రఖ్యాతులతో వుండాలి. ఎదుటివాడికేం వుండకూడదు.!

**ఎస్ ఆర్. బి. — బరంపురం.**

మీరు ఏ దేవుణ్ని నిత్యం పూజిస్తారు?

దైనందిన అవసరాలను తీర్చి, మనసుకి శాంతిని శరీరానికి విశ్రాంతిని,వ్యక్తిగత స్వేచ్ఛని సహృదయంతో అడక్కుండా యిచ్చే దేవుని నా ఇంట కట్టి వుంచాను.






## ఇంటింటి చిట్కాలు

చిట్కాలు పంపేటప్పుడు అవి పత్రికలో యీ మధ్యనే పడ్డాయేమో గమనించి మరీ పంపండి. మొదట మీరు చేసి చూసి, మంచి ఫలితాలు వస్తేనే తోటివారికి కూడా పని కొస్తాయి కనుక అప్పుడు పత్రికకి రాయటంమంచిది కొత్త కొత్త చిట్కా లైతేనే పత్రికలో వేయటానికి వీలుం టుంది. కాని పాత చిట్కాలు విన్నవి పంపినా 'వాడే' అవకాశాలుండవు. మీ 'చిట్కాలు' ప్రచురణకు తీసు కోకపోతే వాటిని తిప్పి పంపటం సాధ్యం కాదు. కనుక మీకు ఆ విషయం తెలియచేయటానికి వీలుగా స్వంత చిరునామా గల స్టాంపు అంటించిన కార్డు కూడా 'జత'చేయటం మంచిది. వేయటానికి తీసుకున్న చిట్కాలు వీలు వెంబడి వేసే అవకాశం. హక్కు సంపాదకునిదై యున్నది కనుక ఉత్తరాలు రాయకండని మనవి. —సం.



## ప్రశ్నావళి

**బి. వి — మాచెర్ల**

విద్యార్థులకు నీతులు చెప్తూ, బ్రాందీ తాగుతూ రాత్రి పేకాడే టీచర్లను ఏమనాలి?

వారు చెప్పింది వినాలి గాని, వారు చేసేది చేయుమని వారు చెప్పనంత కాలం— మీకెందుకు బాధ

**వి. వి. ఆర్ — హైదరాబాదు**

మీరు ముసలివారా?

అవును ముసలితనం ఎంతో బాగుంటుంది మనస్సు పడుచుగా వుంచుకోవడం ఎలాగో చేతనైతే!

**వి ఎస్ డి — ధవళేశ్వరం.**

కె రా గారూ రచయిత్రుల గురించి కుటుంబరావుగారంత ఘాటుగా విమర్శిస్తే మీరెలా వూరుకున్నారు? మీలాంటి వాళ్లలా నిమ్మకి నీరెత్తినట్లు వూరుకోవడం నాకేం నచ్చలేదు

ఏదో పెద్ద వారు— కొ కు రావుగారు వారు కోప్పడినా ఆవేశపడినా నాలాంటి వాళ్లు రెచ్చిపోవడంలో అందం లేదు!

**వి. ఏ పి — తిరువానూరు**

మీ జవాబులతో బాటు మిమ్మల్ని చూడాలని వుంది పత్రికలో మీ ఫోటో వేయిస్తారా?

ప్రమాదం భాయీ, జవాబులు చదివి తిట్టి వూరుకుంటున్నారు ఫోటో వేస్తే తన్నడానికి వస్తారు

**యు ఎస్. బి — చిలమత్తూరు**

భార్యాభర్తల ప్రేమ ఎప్పుడు భంగమవుతుంది?

ఒకరిపై ఒకరికి నమ్మకం తగ్గినప్పుడు

**ఎమ్ కె — కర్నూలు**

అక్కయ్యా పౌర్ణమికి, అమావాస్యకు పిచ్చి వాళ్లకు పిచ్చెక్కువ అవుతుందెందుకు?

వాళ్ల అదృష్టవంతులు ప్రస్తుత పరిస్థితులు మారుతుంటే—పౌర్ణమికి, అమావాస్యకి కాదు రోజుకి రోజుకు ఎక్కువ అయిపోతోంది — నా పిచ్చి

**సి వి. ఆర్ — తిరుపతి**

స్త్రీ స్థానం స్త్రీది పురుషునితో సమానం కాకూడదు అయితే సంఘమే ప్రమాదానికి గురి అవుతుంది స్థానాన్నిబట్టి బాధ్యతలుంటాయి.

అలాగా?! మరిప్పుడింత ప్రమాదస్థితిలో వున్న సంఘానికి—కారణం ఏమిటబ్బా?!

### రచయితలకు మనవి

స్థానికంగా వున్న రచయితలు, కార్టూనిస్టులు కూడా మా కార్యాలయానికి వచ్చి వారి రచన అందజేస్తున్నప్పుడు వాటితోపాటు స్వంత చిరునామా గల స్టాంపు అంటించిన కవరు పెట్టడం అవసరం —సం.

## సామాన్యుని సణుగుడు

రివ్వున వచ్చిపడింది. సిసింద్రీ లాంటి సిగరెట్... మహానుభావు డెవరో రిక్షా బండీలోనుంచి అట్లా విసిరేశాడు... అది ఎర్రగా డేంజర్ లైట్‌లా వెలుగుతూంటే... ఆర్పేశాను కాలితో మటి ... అంతలో ఎవరో మరి! యువకులు కాబోలు కాల్చిన సిగరెట్ పీకను దీపావళి బాణాసంచాలాగా గిరగిరా గాలిలోకెగిరి పడేలా విసిరేసి పోతున్నారు... మట్టేశాను. తుఫక్కున వూసి మరీ పోయే సిటీబస్సు లోనుంచి మరో చుట్ట పీక పడేశాడో పెద్ద మనిషి...యింత నిర్లక్ష్యంమరే సభ్య దేశాలలోనైనా వుంటుందా? అని అనుమానం వచ్చింది. ప్రపంచంలో ఎక్కడైనా యింతబద్ధకం యింత నిర్లక్ష్యం– యింత "అశుభ్రత"అనరేం–ఎందుకంటే సిగరెట్‌లు కాల్చి కాలుతూ వుండగా పారేసేవారు– తమలపాకులు నమిలి ఊసేవాళ్లు– రోడ్డువార గలీజుగా వుంటుంది కనుక మధ్యగానడుస్తూ వుమ్మేసేవాళ్లు... కాల్చిన సిగరెట్ పీకలు నిప్పులు రాజుతూ వుండగా రోడ్డు మీద యింటి కప్పులపైన పారేసేవాళ్లు వీళ్లంతా నిరక్షరకుక్షులు కారు. శుచి శుభ్రాలమీద సంస్కారం సభ్యతలమీదా అవసరమైతే పాయిన్ట్రీ చెప్పగల సమర్థులే! ధనవంతులు. విద్యావంతులు, తెల్లని దుస్తులు ధరించేవాళ్లూ రకరకాల ఫ్యాషన్‌లు చేసేవాళ్లే... సిగరెట్ పీకలు, బీడీపీకలు చుట్టలు కాల్చి కాలుతూండగానే పారేయడం మనిషి లోని అహంకారం నిర్లక్ష్యం– వాటికి చిహ్నం– యిది కొందరు అనాగరికులు తెలియక చేస్తే నాగరికులు తెలిసి 'స్టేటస్ సింబల్'గా యిలాంటి అలవాట్లు చేసుకుంటున్నారు. బస్‌లో సిగరెట్‌లు కాల్చరాదూ అన్న బోర్డుంటుందా? కండక్టర్‌గారి పెదాలమధ్య వెలిగే సిగరెట్‌కి అర్థం ఏమిటి? సిటీబస్‌లో లోపల కూర్చున్న వాళ్లు రోడ్లమీదకి వుమ్మడం, చీదడం, సిగరెట్‌లు పారేయడం వీటికి విరుగుడుందా? ఎన్ని సిగరెట్‌లు మనలాంటివాడు కాలిక్రింద మట్టేసి ఆర్పుతాడూ... పోలీసులు, సైకిళ్లమీద లైట్ లేకుండా పోయేవాళ్లని కోప్పడ్డట్లే యీవిధంగా కాలుస్తూ కాలుస్తూ వున్న సిగరెట్‌లు పారేసేవాళ్లను గదమాయిస్తే బాగుణ్ను అనుకున్నాను కాని ఓ పోలీసు జవాన్ అలా సైకిల్‌మీద పోతూ 'రివ్వున' పడేలా కాలుస్తున్న సిగరెట్‌బిట్ నాలుగు రోడ్ల జంక్షన్‌లో పారేసి పోయాడు యింకేం చేయను? దారంట నడుస్తూంటే కాలికి చెప్పులు లేని పాపాయిలు స్త్రీలు వీటిని త్రొక్కే ప్రమాదం వుంది ... ఇవి ఎండలకి రగిలి యింతై అంతై వందలాది కొంపలను పరశురామప్రీతి చేసే అవకాశం వుంది; అని ఎవరికెవరు చెప్పాలి ... బెటర్‌గోటు ఏ ఏసీ థియేటర్ ... అందులో సిగరెట్‌లు కాల్చరాదుగా అనుకుంటూంటే...అందులో ప్రక్కనే కూర్చున్న పెద్దమనిషి దగ్గర్నించి ఖరీదైన పొగకంపు... చిన్న పోకెట్ డేంజర్‌లైట్‌లాగ సిగరెట్టూ... సో... మనం దీన్నించి కాపాడబడబోము ... మనంత నిర్లక్ష్యంగల జాతి మనదేగాని... మరోటి వుంటే మనకి అదే అదృష్టకారణం కాదూ? దీనికల్లా మందొకటి వుంది... సిగరెట్‌కాల్చడం నేర్చుకోవాలింక... అంతేనా?...

[వి ★★]

## మినీ ఇంటర్వ్యూలు

చీరలు కట్టుకున్నప్పుడున్న అందం బెల్ బాటమ్స్ వేసుకున్నప్పు డుండదని ఇప్పుడిప్పుడే తెలుసుకున్నానంటోంది కుమారి కమల. మన దారిన మనంపోతేరోడ్ సైడ్ రోమియోలెం చేస్తారని ప్రశ్నిస్తోంది. ఆడపిల్లల కాలేజీలో చదువుకుంటున్న ఈ అమ్మాయిది, కో ఎడ్యుకేషన్ ఉంటే ఒకళ్ళనొకళ్ళు అర్థం చేసుకునే పరిస్థితి ఉంటుందనే అభిప్రాయం. శాంతినికేతన్‌లో పైచదువులు చదవాలన్నది ఆశయంగా గల ఈ కుమారి సినిమాలమీద ఎక్కువగా డబ్బు ఖర్చు చేస్తుందిట. హిందీ సినిమాలు ఇష్టంగా చూసే కమల ఈమధ్యనే సినిమాలు చూడనని ప్రామిస్ చేసిందట. తీరిక సమయాల్లో సరదాగా బొమ్మలు వేస్తుంది. మంచి ఆర్టిస్ట్ కావాలన్నదే కోరిక.



ఇంటర్మీడియెట్ విద్యార్థిని కుమారి విజయశ్రీ. తీరిక సమయాల్లో నవలలు చదువుతూ, అప్పుడప్పుడు చిన్న చిన్న కథలు వ్రాస్తుంటుంది. గేమ్స్ అంటె ఇష్టమేకాని ఆడటం రాదు. కో ఎడ్యుకేషన్ అంటే ఇష్టంలేదు. మరి ఆడపిల్లల కాలేజీలోనే చదువుతోందందుకేనేమో! హిందీ సినిమాలు ఎక్కువగా, తెలుగువి తక్కువగా చూస్తుంటివి. రోజారమణి, ధర్మేంద్ర, జయబాధురి అభిమాన తారలు. నేటి విద్యా విధానంలో తప్పక మార్పు రావాలని కోరుకుంటోంది విజయశ్రీ. విద్యార్థులు సమ్మెలు అంటూ చదువులు పాడు చేసుకోకూడదు అంటుంది యీ అమ్మాయి!



హింసాకాండను అణచాలనే ఆకాంక్ష. అందుకే పోలీస్‌లోగానీ, మిలటరీలోగానీ చేరాలనుకుంటున్నాడు రామమోహన్ దాస్. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో లా రెండవ సంవత్సరం చదువుతున్న ఈ యువకుడికి ఇందిరా గాంధి పరిపాలనం చేసే ఇష్టం. నాటకాలలో వేస్తాడు. చాలా బహుమతులు కూడ పొందాడు. ఈ మధ్య విడుదలయిన సినిమాలలో 'ఎవరికి వారే యమునాతీరే' బాగున్నదిట. యన్. సి. సి. లో అండర్ ఆఫీసరు అయిన ఈ అబ్బాయి ప్రేమించి పెళ్లిచేసుకోవాలనే నిర్ణయించుకున్నాడు!



[గీతా]

# ఫాల్గుణి డైరీ

(16వ పేజీ తరువాయి)

### లారీ ఢీకొని అన్నాచెల్లెళ్ల మరణం

పులకపల్లి (పశ్చిమ గోదావరి) స్కూలులో చదువుకుని అక్కణ్ణుంచి మైలు దూరంలో వున్న యింటికి ఒక సైకిలు మీద వెళ్తున్న 12 ఏళ్ల వెంకట్రావు, అతనిచెల్లెలు సత్యకుమారి నీ లారీ ఢీకొనడంతో అక్కడికక్కడే చనిపోయారట. లారీ డ్రయివరు పారిపోతూండగా చూపరులు పట్టేశారట.

### ముస్లిం స్త్రీల ముందంజ

కేంద్ర ప్రభుత్వం సినిమా డాక్యుమెంటరీ శాఖవారు ఆలీఘర్ ముస్లిమ్ విశ్వవిద్యాలయంలో నో డాక్యుమెంటరీ చిత్రాన్ని తీస్తుండగా కొందరు విద్యార్థులు కెమెరాలకు అడ్డం నిల్చుని "ఈ విధంగా ముస్లిమ్ వనితలు సినిమాలో వేయడం యిస్లాముకు విరుద్ధం" అని ఆర్భాటం చేశారట. ఒక సీను కోసం కెమెరా ముందు నిలుచున్న అయిదు వందల మంది యువతులు ఆ నినాదాన్ని త్రోసి పుచ్చి ధైర్యంగా ఆ సినిమాలో నటించేశారట. అంతర్జాతీయ మహిళాసంవత్సరాన్ని పురస్కరించుకుని భారత ప్రభుత్వం యీ డాక్యుమెంటరీ తీసిందట — మరిహానం!! వుమెన్ షల్నాట్ ష్రింక్!! య్యా!!

### సొరంగంలో బతకొచ్చా

1969 లో టిల్కరన్ అనే ఆయన జోయిసెన్‌లో 78 రోజుల 65నిముషాలపాటు భూమిలోని నో సొరంగం (లేక గుహ) లో వున్నారట. ఈ మధ్య ఎవ్మార్ స్మిత్ అనే ఆవిడ ధైర్యంగా నో భూ గుహలో వంద రోజులు వుండి క్షేమంగా బయటికి వచ్చి కొత్త రికార్డు స్థాపించిందట. హైల్ డై వుమన్!! మోర్డనె మాన్!!

### కిడ్నాపింగ్ ఇన్సూరెన్సు

ఇటలీలో యిటీవల మనుష్యులను ఎత్తుకుపోవడం ఎక్కువైపోయిందట. ఈ సందర్భంలో భయపడే వారందరూ "కిడ్నాపింగ్ ఇన్సూరెన్సు" తీసుకో వచ్చని తత్సంబంధమైన ఇన్సూరెన్సు విభాగం అన్నదట. వారేంచేస్తారెవరో ఎత్తుకు పోతే!!

### ఎవరెస్టంతెత్తు ఎదిగిన ఎం. పి ల జీతాలు

బ్రిటను యం. పి. ల జీతాల విషయం పార్లమెంటులో చర్చకు వచ్చి తాను విప్పకున్న ఎం. పి. కి ప్రతి పౌరుడూ వారానికో పెన్నీ చొప్పున ఆ ఎం. పి. జీతానికి యివ్వాల్సొస్తున్న లెక్కలు తేలాయట. ఇలా గనుక వినాలయితే, బ్రిటనులో వున్న 39 మిలియనుల పౌరులూ 618 మంది ఎం. పి. లకు గాను ఆ లెక్క చొప్పున యిచ్చిన డబ్బు పార్లమెంటులో రాసిగా పోస్తే, ఆ డబ్బు ఎవరెస్టు శిఖరమంత ఎత్తుకు ఎదుగుతుందని లండన్ డైలీ టెలిగ్రాఫ్ రాసిందట— అర్థమయ్యెనా!!

### నగ్నశరీరాలకు రంగులు

ఓ రిటైర్డు మేయరుగారు ప్రశాంతంగా వుండడానికి చక్కని భవనం కట్టించుకున్నారట. ఆ భవనం సముద్రపొడ్డున వుందట. అయితే ఆ మేయరుగారికి బీచ్‌లో నగ్నంగా హాయిగా విచ్చలవిడిగా, బాహాటంగా తిరిగే జంటలు, జంటలు కనుపించాయట. తన మేడ మీద నుంచుంటే. ఈ విషయం ఆయన పోలీసు, తదితర అధికారులకు తెలియజేశారట. వారెవరూ యీ విషయములో జోక్యం కలుగజేసుకోనందువల్ల మేయరుగారికి తిక్కరేగి నో పుంజెడు మంది మనుష్యులను తాను నియమించి వారి చేత ఆ నగ్న సుందర, సుందరీమణుల నగ్న శరీరాలకు రంగులు వేయించేశాడట. హౌ లక్కీ! ఎవరా నగ్న సుందరీమణులు! ఎవ్వరు! కారు. ఆ రంగు లేసిన వారు !!

### 'ఆర్లీ'లో గుప్త ఆయుధాలు

ప్యారిస్‌కు చెందిన అంతర్జాతీయ విమానాశ్రయం "ఆర్లీ"లో పోలీసులు ఒకే నెలలో జరిపిన సోదాలో ప్రయాణీకుల వద్ద 60 రివాల్వరులు, పిస్టళ్లు, 162 బాకులు, కత్తులు, 371 కత్తులు 38 రేజర్లు వగైరాలు దొరికాయట. ఇవన్నీ ఆయా ప్రయాణీకులు గుప్తంగా తెచ్చుకుంటున్నవట— కిమర్థం!

---

**విజ్ఞానం — వికాసం**

### రక్తపోటు నివారణ ఎట్లా

ఉధృతంగా వచ్చే రక్తపుపోటు (హైపర్ టెన్షన్) ఒక్కొక్కసారి ప్రాణహాని కల్గించవచ్చు. అతి తక్కువ స్థాయిలో వచ్చిన రక్తపుపోటైనా సరే అదుపులో ఉంచాలంటే ఆరోగ్యకరమైన అలవాట్లను పాటిస్తూ ఉండాలి. అమెరికన్ వైద్య సంఘం వారు ఈ క్రింది జాగ్రత్తలను తీసుకోవాలంటున్నారు :

(1) మిా బరువు తగ్గించండి

(2) ఉప్పుతినడం తగ్గించండి. అధిక రక్తపోటు ఉన్నవారికి ఉప్పు హానికరం.

(3) నియమిత వేళలలో వ్యాయామం చెయ్యండి. ఈత కొట్టడం కూడా వ్యాయామంతో సరి అయినదే.

(4) మానసికంగా విశ్రమించటం అలవాటు చేసుకొనండి. యోగాభ్యాసం చేసినా చెయ్యవచ్చు. ఈ పని సంపూర్ణంగా చేయలేకపోతే వైద్యుల సలహా మేరకు మందులు సేవించి ఈ క్రమాన్ని పరిపూర్ణంగా అమలు పరచండి.

Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna

శ్రీ విజయభట్ ప్రొడక్షన్సు

# గుణవంతుడు

ఈస్ట్‌మన్ కలర్



దర్శకత్వం
ఆదుర్తి సుబ్బారావు

నిర్మాతలు
యస్.యస్.భట్
యస్.యస్.మూర్తి

సంగీతం
కె.వి.మహదేవన్

మాటలు
సత్యానంద్

అన్నపూర్ణా
ఫిలింస్

lpana

ANNAPURNA